శ్రీ తిరుమల వేంకటేశాయనమః



# అగస్త్య రసాయనిక తంత్రము

[ పద్యకావ్యము ]

గ్రంథ సంస్కర్త:

అన్నదానం నరసింహాచార్యులు.



మూల్యం: రు. 20-00

శ్రీ తిరుమల వేంకటేశాయనమః



# అగస్త్య రసాయనిక తంత్రము

[ పద్యకావ్యము ]

గ్రంథ సంస్కర్త:

ఆయుర్వేదభిషగ్రత్న అన్నదానం నరసింహాచార్యులు.



మూల్యం : రు. **20-00**

ప్రథమ ముద్రణము : 1000 ప్రతులు
1984 జూన్ నెల



ప్రాప్తిస్థానము :

అన్నదానం నరసింహాచార్యులు
ఆయుర్వేద భిషగ్రత్న
కడవకొల్లు గ్రామము
తాడిపత్రి తాలూకా
అనంతపురము జిల్లా

ముద్రణ :
శ్రీ రంగరామానుజ ప్రింటింగ్ ప్రెస్,
తాడిపత్రి.



శ్రీతిరుమల వేంకటేశాయనమః



# Tirumala Tirupati Devastanams

This Book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devastanams Under Their Scheme Aid To Publish Religious Books.

కం॥ తిరుమల వేంకటపతి వర
కరుణన్ గృతులచ్చుఁ దీర్చుఁ గలిగితి ధనమా
హరి యొసఁగె నేఁ గృతార్థుఁడ
ధర, తద్ఋణ ముక్తికెపుడు దాసుఁడ నగుదున్

గ్రంధ సంస్కర్త.

# పీఠిక.



పూర్వకాలమున అగస్త్యమహర్షులవారు, శరధి అపోశసముఁ జేసినట్లును, వాతాపి రాక్షసాధములఁ బోకార్చినట్లును కథలలో మనము వినుచున్నాము. అమ్మహానుభావుఁడు ద్రవిడ భాషలో అగస్త్యప్రోక్తమను, రసాయనిక గ్రంధమును రచించి, యందులో చౌషష్టిపాషాణ, రససమ్మేళనాదులు, వానినుపయోగించు విధానముఁ బేర్కొనుచు, పారదాద్యుపరసాదులను సత్త్వముగాదీయు విధానములను చక్కఁగ వివరించుచు, రసమును బద్ధముగావించు విధానములు, నీచలోహమును, స్వర్ణంగామార్చు వైఖరిని లెస్సగానుడుపుచు, రసవాదవైద్యులకు, మార్గదర్శకుఁడయ్యెను.

భారతీయ మహర్షులెందరో నీస్వర్ణప్రక్రియఁగూర్చి వివిధ రకములగు గ్రంధములు రచించిరి. విజ్ఞానశేముషీధురంధరులెందరో, నీ గ్రంధములఁదిలకించి, జీవితాంతము శ్రమించి శ్రీవాదవిద్యలోఁ గృతార్థులుగా లేకపోయిరి ఇందుకు కారణమేమై యుండునని యోచించితిని. సంస్కరించని పారదమును, యోగములందుఁగూర్చి యోగభ్రష్టులగుచున్నారు. సర్వతోముఖ ప్రజ్ఞకలవాఁడు, నైయున్నవానికే, నీయోగములు ఫలించును. లేనిచో శ్రమకు లోనై చెడిపోవుదురు.

ఓషధీసత్త్వము రసమును క్రమబద్ధమొనర్చుటలో ముఖ్యాంగమైయున్నను, తద్రసాణువుల, లెస్సగా నతుకుకొనులాగునఁజేసి బద్ధసూతములకుఁజెప్పఁబడిన, లక్షణములన్నియు, నిలిచినప్పుడే అక్షయ స్వరూపముఁబొందినప్పుడే, యాసిద్ధబద్ధరసము, తద్యోగానుకూలమగును లేనిచో నిష్ఫలప్రయత్నమేయగును.

రసవాదకుల కీగ్రంథము. మార్గదర్శి. ద్రవిడభాషను, తెనుగుభాషలోని కనువదింపఁబడిన అగస్త్యప్రోక్తమును, పద్యకావ్యముగ రచించితిని పాఠకులు చదివి, కృతార్థులగుదురుగాక.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కమిటీవారీగ్రంథమును అచ్చొత్తించుటకుగాను ద్రవ్యసహాయమొనర్చిరి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు శ్రీశ్రీశ్రీ జి. కుమారస్వామిరెడ్డి ఐ. ఎ. యస్. వారికి, ఎడిటరుగారైన శ్రీశ్రీశ్రీ కె. సుబ్బారావు యం. ఎ. వారికి ప్రొఫెసర్ శ్రీశ్రీశ్రీ జి. యన్. రెడ్డి వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములర్పించుచున్నాను. శేషశైల శ్రీమద్వేంకటప్రభుడెల్లవేళల దీర్ఘాయురారోగ్యవైభవముల నొసంగి మిమ్ముల చల్లగా రక్షించుగాత.

ఇట్లు,
గ్రంధకర్త.



1983 మార్చి 13 వ తేది ఆదివారము ఈనాడు దినపత్రికా ప్రచురణ.

## ఆధునిక రససిద్ధులు.



కాశీ నివాసి పండిత్ కృష్ణపాల్ 1943 సం॥ లో హృషీకేస్ లోని ప్రముఖుల సమక్షన రసవిద్యాద్వారా పాదరసంతో బంగారు తయారుచేశాడు. ఆబంగారము ఆకాలమ్లో డెబ్బైరెండువేల రూపాయలకు విక్రయించబడింది. ఆమొత్తం పంజాబులోని, సనాతన ధర్మప్రతినిధి సభకు విరాళంగా యివ్వబడింది. బనారస్ హిందూ విశ్వవిద్యాలయ ప్రాంగణంలోని విశ్వనాథ మందిరముపై అంతస్థులో రసవిద్యలో ప్రముఖ ఆచార్యుడైన నాగార్జుని చిత్రంతోపాటు పాలరాతిపై ఈవివరాలుకూడా చెక్కబడి ఉన్నాయి.

ప్రాచీనకాలంలో వనమూలికలతోను, పాదరసముతోను కృత్రిమంగా బంగారం తయారు చేసేవారని ప్రతీతి. పదవ శతాబ్దంలో కృత్రిమంగా బంగారం రూపొందించే ప్రక్రియ వ్యవహారంలోఉండేది. పదకొండవ శతాబ్దంలో ఆల్‌బెరూనీ అనే విదేశీయాత్రికుడు మనదేశం సందర్శించి యిక్కడి సిద్ధులు బంగారం తయారుచేసేవారని పేర్కొన్నాడు. నాగార్జునికి ముందు, తర్వాతకూడ ఎన్నో గ్రంథాలలో బంగారం తయారుచేసే పద్ధతులు ప్రస్తావనలు ఉన్నాయి. దేశంలో కరువుకాటకాలు సంభవించినప్పుడు రసాయనాచార్యులు కృత్రిమంగా బంగారం తయారుచేసేవారని, ఆబంగారంవల్ల ప్రజలు ఆకలిచావులనుంచి రక్షింపబడేవారని అనేక గ్రంథాలలో ఉంది.

గత ఏభయి [50] సంవత్సరాలలో రసవిద్యలో నిమగ్నులైన నలుగురి పేర్లను ప్రధానంగా పేర్కొనవచ్చు. వారు [1] అశుతోష్

సన్యాసి [2] రఖాల్‌దాస్ [3] కృష్ణపాల్ [4] రామ్‌లఖన్‌పాండే 1950 లో రఖాల్‌దాస్ పశ్చిమ బెంగాల్లో ప్రభుత్వవైద్యునిగా పనిచేసే వాడు. పదవీవిరమణ చేసినతర్వాత బంగారం తయారుచేసే విధానాన్ని కనుగొనడంలో లీనమయ్యాడు. ఆసందర్భంగా ఆయన కొన్నిలక్షలు రూపాయలు ఖరీదుచేసే ఎంతోపాలాన్ని ఖర్చుపెట్టేశాడు. ప్రస్తుతం ఆయన ఎక్కడ ఏలాంటిస్థితిలో ఉన్నారో ఎవరికీతెలియదు కానీ ఆయన కాశీలో ఉన్నంతవరకూ బంగారం తయారుచేసే విధానాన్ని మాత్రము కనుగొనలేక పోయాడు.

రఖాల్‌దాస్ మేనమామకొడుకు అశుతోష్ ఆయన గృహస్థాశ్రమాన్ని పరిత్యజించి సన్యాసిగామారి జగన్నాధపురిలోని ఆశ్రమంలో స్థిరపడ్డాడు. అక్కడ అశుతోష్‌కూడా బంగారం తయారుచేయడానికి ప్రయత్నాలు కొనసాగించాడు. ఆయనకూడా విజయం సాధించలేక పోయాడు.

వారణాసికిచెందిన కృష్ణపాల్‌శాస్త్రి బంగారం తయారుచేయడంలో విజయం సాధించాడు. కృష్ణపాల్ కాశీలో మొత్తం ఎన్నిసార్లు బంగారం చేశాడో ఖచ్చితంగా చెప్పలేం, కాని బనారస్ హిందూవిశ్వవిద్యాలయ ప్రాంగణంలోని విశ్వనాథ్ మందిరంలోగల శిలాఫలకం ఆవిషయాన్ని రుజువుచేస్తుంది. కవిరాజ్ ప్రతాపశింగు వియోగి హరిలాంటి ప్రముఖుల సమక్షంలో బహిరంగంగా ఆప్రక్రియ ప్రదర్శింపబడిందని తెలుస్తోంది.

కృష్ణపాల్ మొదట్లో పాటియాలలో నివసించేవాడు. ఆయన ప్రథమంగా వారణాసిలో అడుగుపెట్టినప్పుడు తిండికే కటకటగా ఉండేది కానీ ఉన్నట్టుండి సంపన్నుడయ్యాడు, సుఖియాను వివాహం చేసుకున్నాడు. తర్వాత ఆమెపేరును రజవంతిగా మార్చాడు. 1943 సం॥ లో

ఆయన హరిద్వార్‌నుంచి వారణాసి వచ్చాడు. అప్పటికాయన వయస్సు అరవైఅయిదు [60] సంవత్సరాలు. వారణాసిలో అస్వస్థుడై అక్కడే మరణించాడు.

ఆతర్వాత హరిద్వార్‌లోని ఆయన నివాసస్థలములో ఎన్నో కిలోల బంగారం లభించిందని, ఆబంగారాన్ని వారి శిష్యులు భార్యకు అప్పగించారని విశ్వసనీయంగా తెలుస్తోంది. బహుశః అది ఆయన చివరసారి తయారుచేసిన బంగారమై ఉండవచ్చు.

వారణాసికే చెందిన హర్‌తీర్థ్ వీధిలోనివసించే 65 సంవత్సరాల పండిత్‌రాంలఖన్‌పాండే గత ముప్ఫైఅయిదు సంవత్సరాలనుండి బంగారం తాయారు చేయడంలో నిమగ్నుడై యున్నాడు. రాంలఖన్ 20 సంవత్సరాల పరిశోధన తర్వాత ఆప్రక్రియలో సఫలీకృతుడయ్యాడు. 1966 డిశంబరు 31 తేదీన సహాయం కోరుతూ కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రికి ఒకలేఖ వ్రాశాడు. కానీ యేవో కారణాలవల్ల ఆప్రయత్నము సాగలేదు.

ఎస్. ఎస్.



## 1983 సెప్టెంబరు 25 తేదీలు ఆదివారం ఆంధ్రప్రభ (ప్రచురణ)



సాధారణంగా మనుష్యులందరికి బంగారం అంటే కాంక్ష, విపరీతం అనే మాటలు యధార్థం! ఈ విషయం మన జీవితానుభవముతోను శాస్త్ర పురాణాది గాథలు, చరిత్రలు మొదలైన వాటివల్ల మనకు తెలిసిన విషయమే.

"కాంతలపైనా కనకంబుపై నాసలేనివాఁడు పుడమిలేనివాఁడు" అన్నాడు వేమన.

గనులు త్రవ్వికాని వ్యాపారం చేసికాని శ్రమించి కాని దొంగతనము చేసికాని బంగారాన్ని చేజిక్కించుకోవడం మనుషులకు పరిపాటి.

రాగి మొదలైన చవుక లోహాలను సువర్ణంగా మార్చటం అనే విద్య ఒకటి గ్రంథస్థమైయున్నది.

ఈ విద్యను 'స్వర్ణకరణి' పగారవిద్య అంటారు. ఈ విద్యను ఉరురుభాషలో 'కీమియా' అని, ఇంగ్లీషుభాషలో 'ఆల్‌కెమి' అని ఇతర భాషలలో ఇతర విధాలుగా పేర్లున్నాయి.

"ఆధునిక సైంటిస్టులు" బంగారు పదార్థము కదా! దానిని సృష్టించుట మేమిటి 'పిచ్చి' అంటారు.

ప్రచారంలోవున్న 'స్వర్ణకరణి, విద్య ప్రకారము నీచలోహాన్ని ఉత్తమలోహంగా మార్చే ఒక వస్తువును "పరుశవేధి" అంటారు, ఈ పరుశవేది తాయి అని, ద్రవపదార్థమని, గడ్డిలాంటిదని తర్జన భర్జనలు చేసినవారిలో మన దేశీయులేనిక "బ్రవున్‌దొర" లాంటి విదేశీ

యులుకూడా వున్నారు. శ్రీ శంకరాచార్యులవంటి వారు కూడా జీవాత్మ పరమాత్మలో లీనం కావటాన్ని ఉదాహరణంగా పరశువేది సోకిన యినుము బంగారమవునట్లు అని ఉదాహరించారు. ఇక "రసవిద్య"అంటే పాదరసాన్ని శుద్ధి సంస్కార విధానాలతో ప్రభావితంచేసి చవుకలో లోహాన్ని బంగారంగా మార్చటం ఈ విద్యను 'రసవాదం' అంటారు. మరొక సామెతకూడా వుంది. ఇతర విధానాలతో స్వర్ణకరణి సిద్ధించక భ్రష్టుడైనవాఁడు పిచ్చివాడు కాఁవచ్చునేమోకాని రసవాదవిద్యలో భ్రష్టుడైన ఫలితమే ఉంది. అంటే 'వాదభ్రష్టో వైద్య శ్రేష్ఠః' అన్నారు. అంటే నానావిధములైన ధాతు, ఉపధాతువుతోను మూలికాది అనేక ఓషదులతోను పరిశోధిస్తాడు. కాబట్టి వాటి పరిచయాన్ని బొంది మూలికాది ధాతువులయొక్క గుణవిశేషాన్ని తెలిసినవాఁడు కావడంచేత వైద్యంలో శ్రేష్టుడవుతాడు. అయితే సైంటిష్టులన్నట్లు బంగానం ఒక మూలపదార్థం [యెలిమెంటు] అణుసంఖ్యా పట్టికలో దీని సంఖ్య 79 సూచికా అన్నం ఎయు కాంతిలోహ సంబంధమైనది. గీటు గీటు రాతి మీద గీసినపుడు బంగారుఛాయగల గీత కనుపించును.

ప్రకృతి సిద్ధంగా లభించే బంగారు స్ఫటికముల అవయవాను రూపత్వం ఇసోమెట్రిక్ భూమియొక్క ఉష్ణోగ్రతకు కరిగి క్రిందికి దిగి పేరుకొని అవయవాకృతిని 'నగ్గెట్స్' అంటారు, బంగారు యొక్క కాఠిన్యము 2·5-3 తారతమ్యగరిమ గీ 15-19 వక్రీభవన గుణకారము అపార దర్శకము. ఈ విధంగా సువర్ణమునకుగల గుణగణాలను నిగ్గు తేల్చి చెప్పుతూ బంగారము మూలధాతువు. ఇది సృష్టించడం అసాధ్యం. రసాయన విధానాలవల్ల మార్పువల్ల దీన్ని సృష్టించడం రష్యా మొదలగు దేశాలలో జరిగినా ఈ విధానంవల్ల లభించిన బంగాగు గిటు బాటు ఖరీదు, బజారులో లభించే బంగారము ఖరీదుకన్నా ఏన్నో రెట్లు అధికం కావడంవల్ల ఆ విధానాన్ని వదిలేశారు.

అయితే 'సువర్ణకరణి' అపద్ధమేనా? 'అపద్ధం' కాదు, సాధ్య అనటానికి ఎన్నో శాస్త్ర ఆధారాలు గాధలు ఉన్నాయి.

"రసవాదము" రసవిద్యయందు, ఆరితేరిన వారిలో ఆదిమచం ద్రసేనుడు, లంకేశ్వరుడు (రావనుడు) మత్తమాండవ్య ఇంద్రదత్త కలంభి, నాగార్జునుడు, ఋషిశృంగ, రసేంద్రతిలక, భాలుకి, మైదిలు హారీశ్వర మొదలుగాగల ఇరువదేడుగురు [27] మహామహుల చేతను సింహగుప్తుని కుమారుడైన వాగ్భటాంచార్యుడు వేమనయోగి ఇంకను ఎందరో మహాత్ములు సిద్ధులు మొదలైనవారి చేతను చెప్పబడిన కొన్ని సూత్రాలు ఇలా ఉన్నాయి.

"రసస్య మనసశ్చైవ, చంచలత్వం స్వభావతః! రసబంధో మనోబంధః కిన్నసిధ్యతి భూతలే,,

పాదరసము, మనస్సు సదాచంచల స్వభావముకలవి. పాదరస మునుకాని మనస్సునుగానీ క్రమప్రకారం ఎవరు బంధించచలరో, వారికి సాధ్యంకానిది, ఏదీవుండదని భావము. మనస్సును బంధిస్తే మహా త్ముడవుతాడు. పాదరసాన్ని బంధిస్తే బంగారాన్ని చేయవచ్చు అనేభావ మేకాక అదృశ్యకరణి అనికూడా అంటారు.

శాస్త్రస్వానుభవములచే, శుద్దిజారణ, మారణములు గావించినట్టి పారదమును, ప్రయోగించినప్పుడు అది సర్వరోగములను జయించి "అదేటానిక్,, గా పనిచేసి పుష్టిని ప్రసాదిస్తుందనియు "సుజ్ఞేన సాధి త్రకుర్యాత్త్య సిద్ధందేహా లోహయో" శాస్త్రస్వానుభవాలుగల జ్ఞాని వలన సాధింపబడిన, రసమును, ప్రయోగించి దేహసిద్ధి (కాయకల్ప సిద్ధి) లోహసిద్ధి నీచలోహాన్ని ఉత్తమలోహంగా మార్చవచ్చునని రచింపబడినది.

మఱియొకచోట ఖచ్చితముగా ఉదహరించిన వాక్యము, "సిద్ధేరసే కరిష్యామి నిర్దారిద్ర్య మిదంజగత్" గగనం గంధకం సూతం సింధువారేణ మర్దితం, డోలా యంత్రే పచేద్యామం సర్వదారిద్ర్యనాశనం రససిద్ధిగల్గినచో జగత్తు దారిద్ర్యశూన్యమగునని తేటతెల్లమగుచున్నది ఇంకా మన వేమనయోగి అనుభూతివాక్యము "ఆ॥ హేమకారవిద్య నెఱిఁగినవారెల్ల। వెతలు పడనియెట్లు విద్యచేత। తత్త్వమెఱుఁగు వెనుక తనకు చింతేలరా। విశ్వదా........వేమ ఇంతేకాదు "ఆ॥ బింబఫలము లుండ బిగువైన రసముండ। పసిఁడికొఱకుసు, పాట్లుపడవలయునె!" తాళ కంబెరుగరా। తగరంబెరుంగరో। విశ్వదా........వేమ. మఱియొకచోట 'ఆ॥ వెన్నెలనిలుచుండి, వేపాకుపడవేసి। అడ్డసరసమందు నదియు పిండి। రాగికరుగవేయ రమణబంగారమౌ" విశ్వదా.... మఱియొక చోట "ఆ॥ పుట్టమీదికాయ, పుట్టమీదిదిమన్ను। పుట్టలోనివాని పుట్టుతు దను। గట్టి యీవచనము కాంచనంబగునయా" విశ్వదా.... మఱియు "సనారీ విశ్వేశ్వర సంవాదము" అనే పాతముద్రిత గ్రంధముయొక్క చివరిభాగమందున ఇంకను ప్రాతవ్రాత గ్రంధములందును, మర్మముగా చెప్పబడియున్నప్పటికిని, వీటిని రసవాద విద్యలో చేర్చుకొనక ఆధ్యా త్మిక భావంతో తిలకించాలని కొందరివాదన.

"కిమియా, కీమియా" కహతేక్యామర్ తామియా మిహినత్కీ, మజూరి, జిస్‌దిన్ మిల్తా ఉస్‌దిన్ మజామియా, అని హేళనగా అన్న మాటలోను "బింబఫలములుండ బిగువైనరసముండ" అంటూ వర్ణిస్తూ ఉన్న రసవాదినిచూచి" అరే! ముంత! కూలిచేసి డబ్బుతే, తింటావు, కడుపూ, నిండా" అని మందలించిన మాటలలో యదార్థం లేకపోలేదు.

నేపాల్లో పరశువేధి లింగం ఉన్నట్లు శ్రీశైలక్షేత్రంలోకూడా శివలింగానికి క్రిందఉన్న సప్తమలింగంకూడ పరశువేధి లింగం అంటూ ఉండటంకూడా వింటూఉన్నాం.

నేపాల్ దేశంలో గొఱ్ఱెల కాపరులు మేకల గొఱ్ఱెల కాళ్లగిట్టలకు రాగినాళముల వంటివి అమర్చి అడవిలో మేవుతూ అప్పుడప్పుడూ హాటి గిట్టలను పరీక్షించి పరశువేది స్పర్శవలన బంగారంగా మారిన గిట్టతొడుగులను సేకరించి మళ్లీ రాగిగిట్టలమర్చి పర్వతప్రాంతారణ్యాల్లో నడుస్తుంటారని ప్రతీతి. ఇలాంటి అనేక నిదర్శనాల గురించి విని, అగ్బరు చక్రవర్తి "కీమియా" ను ప్రయత్నించి సాధించాడనికూడ అంటారు.

డాక్టర్ - యస్. జైసింగ్.



-శ్రీరస్తు-

ఆబాల్యమిత్రులు ప్రజాహితాచరణ కార్యదక్షులు నెమళ్ళదిన్నె కొత్తపల్లె

# శ్రీమాన్ గుత్తా వేంకటనారాయణ గారి ఔదార్య పతాక

ఉ॥ ఆపెమసాని తిమ్మనృపులభ్యుదయంబుగ రాజ్యమేలి రం
దాపృధివిన్ గృషీవళులు తత్తృ_ల వీరులునైన వారికం
దేపుగ గుత్త సుంకములకిచ్చిరి, సాగుకు గుత్తదారులై
యేపుర సీమలన్ గనిన, నెచ్చటఁజూచిన కమ్మక్షత్రియుల్.

మ॥ కలరందందు నెమళ్ళదిన్నె నటప్రక్కన్ క్రొత్తపల్లీ నివా
సుల కెల్లప్డు ప్రజోపకార, ధరణీశుంబోలి, సత్కార్య క
ర్మల కొండ్యుండయి గుత్తవంశజలధి ప్రఖ్యాత శీతాంశుడై
యలరారెన్ సిరిఁగల్గి వేంకటమహానారాయణాఖ్యుండిలన్.

ఉ॥ ఏనొకనాడు వారిఁగని యాకృతులచ్చుకుఁదీర్చఁగోఁగా
నానుడి వెంటనేవిని ధనంబునుగొమ్మ ప్రయత్నమంతయున్
న్యూనతలేక చేయుమది యుర్విని, కర్తకు భర్తకెప్పుడున్
లోనగు సప్తసంతతులలోగ్కృతికిన్ ఫలమెక్కుడౌననన్

కం॥ విని, ముదమందితి నాపు
ణ్యునిఁబేర్కొనుచున్ గృతంబునుం బూర్ణమతిన్
గని కావించితి కృతులా
ధనమున ముద్రణముఁబొందెఁ ధన్యుండైతిన్.

కం॥ ఆపుణ్యుండును నాకును
ఆపద్బాంధవుఁడునయ్యె, నానాడిపుడున్
లోపంబులేని మిత్రిన
కాపుణ్యఫలంబు భాగమగుగాకమహిన్.

చ॥ తిరుమల వేంకటేశ్వరుఁడు దీనజనోద్ధరణానురాగుడై
పరమపరోపకారులగు వారలు మీకు సమస్తసంపదల్
తరగని ధాన్యరాసులు, సతంబునొసంగి, తరాలుగాఁగృపన్
ధరణి వసింపఁ బ్రోవుత! నుదారతధీరత నెల్లకాలమున్.

శ్రేయోభిలాషి
గ్రంధకర్త.

# విషయ సూచిక.



అవిఘ్నమస్తు శ్రీ తిరుమల వెంకటేశాయ నమః

# అగస్త్య రసాయనిక తంత్రము

శా॥ శ్రీలక్ష్మీమహిమాభిశోభ లెదపైఁజెన్నొందఁ జక్రాబ్జముల్
గేలన్దాల్చి కృతార్థుఁజేయు, ఘను రక్తిన్ గద్వకల్సీమ, భూ
పాలగ్రామణి, మేసతిమ్మవిభు హృత్పద్మంబునన్ నిల్చి, యె
వ్వేళన్ దర్శనమిచ్చు కేశవుఁడు, సంప్రీతిన్ మమున్ బ్రోచుతన్.

తే॥ చక్షువులుమూడు శిరచతుష్టయము మోము
లైదు, తనువులెన్మిది, చేతులారు, కాళ్లు
పది, విరాజిలు, శ్రీసిద్ధపతి యగస్త్యు
సత్యసంధుని, మదిని సంస్తుపమొనర్తు.

కం॥ భోగాలకట్ట మద్వి
ద్యాగురుఁడగు సుబ్బరాయ దండికవీంద్రున్
భాగవత పుణ్యు సత్యను
రాగమెసఁగ కృతులఁబొగడి, ప్రార్థింతు మదిన్.

కం॥ రసవిజ్ఞాన మమోఘము
రసవిషయము దెలిసినంత రచియించితి వి
శ్వసనీయంబై యుండును
యెసఁగిన తప్పొప్పులను క్షమించుడి కరుణన్.

శా॥ ఆరాధ్యుండగు చన్నకేశవుని నిత్యంబేను ప్రార్థించి శ్రీ
సారంబైన శిలాక్రియాఖ్యఁగృతినిన్ సాధించి నిర్మించితిన్
ధీరస్వాంతుఁడ నన్నదాన కులవార్ధిన్ రత్నమున్ బోలి పెం
పైరాణించితి శీనయార్యకొమరుండన్ నారసింహాఖ్యుఁడన్

చ॥ పరమతపోధనుండు మునివంద్యుఁడగస్త్యుడు వ్రాసె నేర్పునన్
ధరణిజనోపయోగముగ ద్రావిడభాషను వైద్యశాస్త్రమే
త్తెరవచనంబుగా నొకఁడు తెన్గున వ్రాసినదానిఁగాంచి సుం
దరమగు పద్యరత్న సముదాయమునన్ విరచింతు నచ్యుతా.

—: అద్రిజపాషాణ గుణములు :—

కం॥ ఇల నర్వాదినాల్గు తెలుం
గుల పాషాణములు నొప్పుకొండల యందున్
గలిగిన యవి ముప్పది రెం
డెలమిని లవణోద్భవంబులెన్న మురారీ.

సీ॥ వరుస పర్వత సంభవములైన పాషాణ
కోటిగుణంబు వ్రాకుత్తు వినుఁడు
సిందూరమగు నల్లసీసంబు కర్కటి
పాషాణ ధాతువు వలనఁదవిలి
గోళక ధాతువుగూడి సిందూరించు
తెల్లని తగరంబిదెల్ల నిజము
వసుధనాగము హేమవర్ణమగున్ సూత
పాషాణధాతు సంప్రాప్తమునను

తే॥ వంగమాతాళకంబున భస్మమగును
గంధకమున సవీరంబు గర్వమడఁగు
చెలఁగి వీరమ్ము మృత్పుటిని భస్మీకరించు
ఖనిజములఁ దొమ్మిదింటిని కమలనాథ

సీ॥ వైక్రాంత ధాతువుపలన భస్మంబగు
తాళకంబేవేళ తప్పదిదియు
తాళక పాషాణ ధాతువుచే తాళ
కముశుద్ధ రజితంబుగాదె! తలఁప
హేమించు నాగమ్ము నిలమృతుచేత శి
ర్బందు ధాతువుచేత బహుళవేగ
మలవడుగద రసగుళిగెకు తొట్టి పా
షాణ ధాతువుచేత సరస ధూమ

తే॥ మబ్బు గుళిగెకు నతివేగ మాళ్వదంత
ధాతువునఁగల్గు రజితమా తామ్రమెపుడు
శంఖ పాషాణ ధాతువు వంకఁ దవిలి
గుప్తయోగంబులివి కనుఁగొనఁగ శౌరి.

సీ॥ తుత్థపాషాణ ధాతువుసోకి నాగంబు
శుద్ధతామ్రంబగు చోద్యముగను
ఏలోహమైనను హేమించుగద! పలం
డురుధాతువున దీని నెఱుఁగు డయ్య!
కాంతపాషాణంబు కాయశుద్ధికి హేతు
వింగిలీకపుధాతు వెళ్ల వేళ
తామ్రంబుగామార్చు తప్పక నల్ల సీ
సమును యోగమెఱింగి సల్పిరేని

తే॥ గుప్తతామ్రంబు చిటుకలో గురువు గాదె
ధాత్రికర్కాండ పాషాణ ధాతువున్న
కట్టుగద! సీసమెప్డు నిక్కముగ హరిద
శమున సీయోగ మెఱుఁగుడు విమలచరిత.

తే॥ ధవ్యమణిశిలధాతు సంప్రాప్తి ధాతు
వులుగ సిందూరములు మార్పుబొందు నష్ట
సిద్ధిగలుగుట నిక్కమే సీసమైన
యటుకుల యనంగబడు ధాతు వచ్చు శౌరి.

కం॥ హేమింపదె తాళకమే
సీమసలాంగం బొకండు సిద్ధించిన ని
ష్కామకునకు కర్పూరియును
హేమించును మంచిరాగియేని రమేశా.

సీ॥ కచ్చాల ధాతుసంగతి తామ్రమౌ వెలి
పలుకుటూతయోగ పటిమ గనుఁడు
జలుకారుమొగిలు సంబంధమునన్ రసం
బసితవర్ణంబుఁజెన్నలరు నిజము
సీసమౌకాంతమీక్షితిని ధావళ్య పా
షాణధాతుస్పర్శ సరభసమున
అభ్రకధాతువే యబ్బిన శివ వీర్య
మొక్కక్షణంబులోఁ జిక్కువడదె!

తే॥ తెల్లపాషాణమున నుక్కు దివ్యమైన
సీసమగు గౌరిరసమునుఁ జిక్కు వరపి
తామ్రముగ మార్చు నిదియసత్యంబుగాదు
వెడగులకు దీని దెలియంగబడునె శౌరి.

తే॥ అయము సీసంబుగామారు నంజనమున
చల్లగాగట్టునల్ల సీసంబు టూతి
ధాతువున గుప్తతామ్రంబు ధవళమగును,
బూని సీతాంగ పాషాణమునను దేవ!

ఉ॥ ముప్పదిరెండు ధాతువుల మోఘము లద్రిభవమ్ము లొట మున్
జెప్పితి యోగముల్ తెలిసిచేసినఁ గార్యము సిద్ధిబొందు నే
ర్పొప్పఁగఁ జెప్పువాడ లవణోద్భవ ధాతుగుణాళింక నా
తప్పులనెల్లసైచి ప్రమదంబునఁ జేకొనుమయ్య! కేశవా.

పరంగియుప్పు పాషాణములు కుప్పెలోగాచి వంటసేసిన పిమ్మట
-: వాని గుణములు :-

తే॥ ధరణి పుల్తొట్టి పాషాణ ధాతువలన
గుప్త తామ్రంబు గురువయి కువలయమున
గలుగు నవలోహములు నొక్క ఘడియలోన
పసిడిగా మార్చు రసవాద పటిమ కృష్ణ.

తే॥ కట్టుగద! గౌరి యెరునాథ తొట్టి ధాతు
వున్న ధాతువులందెల్ల మిన్న చెప్పు
తొట్టి ధాతువు నదియొక్క త్రుటిని లోహ
జాలముల వేధగా మార్పజాలు శభవ.

సీ॥ అకళంకములకు నయతొట్టి పాషాణ
ధాతువగస్త్యు మతంబు నందు
నాదియౌ కంకుష్టమాది పరంగిల
వణవస్తుతతికి నోపరమ పురుష!
సద్రక్తశింగి పాషాణ ధాతువు సర్వ
మును రాగిఁజేయును పొల్లుగాదు
కట్టురసంబు పుల్తొట్టి ధాతువు చేత
హేమశింగిప్రాప్తి నెపుడు చేధ

తే॥ యోగదా! గుప్తతామ్రంబు నారసంబు
తిమురుగల ధాతువునఁజచ్చు తెలిసి సేయ
కార్కోగిర్ ధాతువునఁ దాళకంబు నసిత
వర్ణమును బొంది వేధయౌ వారి జాక్ష!

సీ॥ తామ్రంబు పరిశుద్ధతను బొందు లింగి పా
షాణధాతువు మైత్రి సలిపెనేని
తెల్లధాతుప్రాప్తి తెల్లసీసము గారి
యందు సీసంబు సున్నంబులగును
సవ్వీరమున లోహసమితి సున్నంబగు
గంధక పాషాణకతన మైల
తుత్థంబు సున్నమైనత్తమిల్లును వస్తు
తతి కళంకంబులు త్వరితముగను

తే॥ వానగెందిని యసితత్వమూను తాళ
కంబు నిముసమ్ములో నీరుగాగ రంగు
నయము, బంగారు సిందూర మగును గాదె!
దివిరి పగడపు పుట్ట సాధింప వరద!

తే॥ అక్కాడాసురి ధాతువు నంటుఁజేసి
గుప్తతామ్రంబు చిటుకలో గురువు నొందు
వేధయౌతామ్రలోహముల్ విమల పంచ
పక్షి పాషాణధాతు సంప్రాప్తి దేవ!

అగస్త్య రసాయనిక తంత్రము

సీ॥ నవలోహములు సువర్ణత్వమొందును రక్త
వర్ణ పాషాణంబు వలన జగతి
భస్మమౌగద! తుత్థపాషాణమునఁ దాళ
కంబు సత్తురిశిని గట్టురసము
రజితధాతుప్రాప్తి రజితమౌ లోహముల్
సిద్ధికిసూతంబు సిద్ధకరణి
వెండిభస్మము తామ్రవేధయౌగద! నీల
పాషాణధాతు సంబంధము నను

తే॥ సింధురంబగు కోడ్త్రల జిక్కెనేని
రసము సౌరగంధిచేతను అసితవర్ణ
మబ్బుదే! తాళకంబున కారసంబు
చక్కఁగాఁ గట్టులవణ పాషాణమునను.

తే॥ గురతఁ గాంచును నాగంబుఁగూడి పసిడి
గుప్తతామ్రంబు వేధయౌ కువలయమున
నింద్రపాషాణ ధాతు వొక్కింత గూఢ
మర్మయోగంబులివి వైద్య కర్మలందు.

ఆ॥ క్రమముగను పరంగిలవణ శిశావళి
కాచకుప్పెలందుఁ గడిమి వంచి
భద్రపరచియుండి వస్తుచిత్తులపైన
వేయవలయు పసిఁడి తీయవలయు.

-: కారసారలవణములు :-

సీ॥ వషల పూనీరు నవాక్షార మేకాంబ
కక్షార మిందుప్పు కాంస్యకాఖ్య
లవణము, సైంధవలవణంబు వరతిలా
లవణంబు గంధక లవణములును
గాజుప్పు చవిటుప్పు కల్లుప్పు పెట్లుప్పు
అబ్ధిఫేనము బిడాఖ్యా లవణము
మీనంబరును, మంచి పొన్నంబ రారతి
కర్పూరమును పచ్చకప్పురంబు

తే॥ అమ్మహాటంకణంబును అమరి యుప్పు
పారయుప్పు ద్విక్షారంబు పటిక రెండు
గన్న నిర్వదై దుప్పులత్యున్నతములు
కారసారాఖ్యలనఁజెల్లు సారసాక్ష.

-: నవలోహ గుణములు :-

సీ॥ కాయసిద్ధియొసంగి కనకభస్మము దొల్త
హేమ విద్యకు సిద్ధి నిచ్చు చుండు
తామ్రభస్మము జాడ్యతతి క్షయాదులఁ ద్రుంచి
గురుతాయడయి సరుకులను గట్టు
వెండిభస్మము మేహవింశతి నడగించి
సరుకులఁ గట్టుచు స్వర్ణ మొసఁగు
వంగసున్నము లోహవర్గము లన్నింటి
హేమింపఁజేయు నూహించిరేని

ఆ॥ కనక తామ్ర రజిత ఘనవంగ సున్నముల్
వాద విద్యలకుఁ బునాది యగుట
మఱువరాని విషయ మరవిందలోచన!
సరస కడవకొలని చన్నరాయ.

కం॥ చెన్నైన తగరసున్నముఁ
గన్న నవాక్షరమెల్లఁ గట్టును త్రుటిలో
కన్నుగల సత్తు భస్మము
గన్నన్ గుర్వగును తాళకద్రవ్యమునన్.

కం॥ ధర పంచలోహ భస్మము
చిరముగ మణిశిలనుజేయు సిందూరముగాఁ
గరమిత్త్రాడి భస్మము సం
బరమున లోహములు హేమమగు లక్ష్మీశా.

తే॥ అయవిభూతి సిద్ధియిడి దేహమును గాచు
ఉక్కుభస్మము, పరసముల నొక్కసారి
చేరి సత్వములను మేల్మి సృష్టిఁజేయు
నాగసున్నమ్ము సోకిన రాగి లోహ
తతుల వేధించు నిజమిది దానవారి.

కం॥ వరమండూరము, కాంతము
నరయగ నూరేండ్లు భూ పుటంబున నున్నన్
వరసుధ దివ్యౌషధమై
నరుల సమస్తామయముల నాశమొనర్చున్

:— శత్రు మిత్ర ద్రవ్య వివరణము :—

:— మైలతుత్థ శత్రు మిత్రములు —:

కం॥ వెలిగారము గౌరి మన
శ్శిల తాళక గంధకములు శివ వీర్యం బిం
గిలికము నూత్న క్షారము
దలఁపన్ మిత్రములు గుప్త తామ్రము కీశా.

కం॥ వీరము భాండవరస క
ర్పూరము మాక్షికము తుత్థమునకున్ హితులై
శ్రీరుచి యోగము లందిం
పారగ శుభమిచ్చు రుజల భంజించు హరీ.

తే॥ అభ్రకంబును పంచలోహములు చౌడు
వంగనాగమ్ము చంద్రలవణ ముదారు
శింగి కాంతంబు కల్లుప్పు సితవిషంబు,
గుప్తతామ్రంబున కహితుల్ కువలయమున

కం॥ హారతికర్పూరము సవు
కారము పెల్లుప్పుతొట్టి ఘన శత్రులుగా
సూరిజనులు వాక్రుత్తురు
భూరిమహాగుప్త తామ్రమునకున్ శ్రీశా.

:— నవాక్షార శత్రు మిత్రము :—

కం॥ వీరమ్ము గంధకము వెలి
గారము తామ్రంబు సత్తు గౌరియు సూరా
కారము తాళకము నవా
క్షారమునకు హితులు మాక్షికమునకు దేవా.

కం॥ మణి శిలలు రాతి నారయు
ఘన మింగ్లీకమ్ము క్రొత్త క్షారంబునకున్
వినరయ్య! మిత్రమగునని
ఘన విజ్ఞానుల కగస్త్యకవి వచియించెన్.

తే॥ అబ్ధి ఫేనంబు కాంతంబయమ్ము, పటిక
జాయి, కల్లుప్పు గాజుప్పు జాతి సున్న
మిందు లవణంబు వంగంబహితులటండ్రు
ధీరమతు లన్నవాక్షారదీప్తి కీశ.

తే॥ కాకి చిప్పలు, చౌతభ్రకంబు కోడి
గుడ్ల పెంకు స్పటిక జాయి కులము సీస
కడ్డి శత్రువులగు నవాక్షారమునకు
నిజము వైద్యంబు దెలియంగ నీరజాక్ష!

-; సురాకార శత్రు మిత్రములు :-

సీ॥ నల్ల సీసము చౌడు తెల్ల పాషాణంబు
కంకుష్ఠ మణిశిల కప్పురంబు
తిమురు గల్గిన ధాతు తెల్లని తగరంబు
కాంతంబు తామ్రంబు గంధకంబు
అల కోడిగుడ్ల పెంకులు తొట్టి సౌరగంధి
మైలతుత్థమినుము నీలవర్ణ!
ఘన శత్రువులు సురాకారంబునకు వెండ్రు
కలు మాక్షికంబును కంబళియును.

తే॥ అబ్ధి ఫేనంబు వెలిగార మాసవీర
మిందు లవణంబు తాళకం బింగిలికము
నాగతుత్థము కల్లుప్పు నాస్మ ఫలము
నాసురాకారంబునకు మిత్రాప్త లీల.

;- కల్లుప్పు శత్రు మిత్రములు -;

సీ॥ కల్లుప్పునకు పటికారంబు మురుదారు
శింగియు కాంతంబు చింతపండు
వీరంబు, చౌడు, కర్పూరమ్ము పగడమ్ము
మణిశిల, యిందుప్పు మహితమైరు
లత్యంత మిత్రమ్ములగు నభ్రకము వంగ
మింగిలీకము శౌరి యినుము రాగి
గంధకంబును, రసకర్పూరమును, వెలి
గారమ్ము మఱియు నాగంబు రజిత

తే॥ మాక్షికము తాళకంబు, లీమహి దలంప
నిపుణమత్తులైన వైద్యులీ నియతి నెఱింగి
బ్రతుకుదురు గాక! లక్ష్మిచే ప్రజ్వరిల్లి
భక్తజనపాల! శ్రీలోల! స్వర్ణబేల!

తే॥ వైద్య మిందుండు వాదంబు వార్ధిలవణ
మిందులో సూతమును గట్టి సిందురించి
గురిజగింజెత్తు వెండినిఁ గఱఁగి వైవ
పసిఁడి యగునంచు నమ్మని వలికె శౌరి.

;- వెలిగార శత్రు మిత్రములు -;

సీ॥ వెలిగారమునకు నెచ్చెలు తెల్ల పటికార
వైదులటందురు వైద్యవరులు
కర్పూరమును రసకర్పూరమును శిలా
సత్తుతిక్తంబు యావత్తు సున్న
పుర్వస్తుకోటియు, పులుసు, నండంబును,
తక్కుపరసములు ధాతువులును,
శత్రువుల్ దలపోయ సకల లోహంబులు
కడకొని మిత్రవర్గమునఁజేరు.

తే॥ కనఁగ లోహంబు లప్పటి కారమునకు
చెలులుగద! మర్మమిది మది తెలిసినట్టి
వాఁడెపో జాణ! వాఁడెపో వైద్యవరుఁడు,
పాపభయనాశ! సర్వేశ! భవ వినాశ.

:- పటికార శత్రువులు -:

తే॥ వీరమును సురాకారంబు పారదంబు
గంధకము నవాక్షారంబు కల్లుయుప్పు
తుత్థమును పటికార శత్రువులు గాగ
తెలియవలయును వైద్యులుతెలివితోడ

:- పటికార మిత్రములు -:

కం॥ హారతి కప్పుర మండము
నారస కర్పూరమామ్లు మాశిలసత్తున్
కారపు సున్నపు సరుకులు
మీఱగ నిర్యాారు పటిక మిత్రమ్ము లగున్.

కం॥ ఈ శత్రు మిత్రముల ని
ట్లా సరుకులఁ దెలిసి కూర్చి యగ్నిపుటంబున్
వేసరక వైచిరేనియు
భాసున్నంబులగు మేల్మి రాజీవాక్షా!

కం॥ ఈ సున్నము సత్వపు బీ
జానమితియును పరసములు సమకూర్చుచు శ్రీ
భాసుర లోహము లందిడ
వాసిగ గురుహాసు లోహ వర్గంబెల్లన్.

-: స్వర్ణ శత్రువులు :-

సీ॥ స్వర్ణవైరులనెల్ల నిర్ణయించెద నగ
స్త్యప్రోక్త వైద్యశాస్త్రాను సరణి
కాకిచప్పలు మాక్షికము వంగ పెట్లుప్పు
కాంతంబు, రసమును, గంధకంబు
గోముఖంబును కోడిగుడ్ల పెంకులు, తాళ
కంబు నాగంబభ్రకంబు గౌరి
హరిదంత పాషాణ మసిత పాషాణంబు
సౌవీరమును శింగి చవిటి యుప్పు

తే॥ ఆమనశ్శిల పొన్నంబరాదు లెల్ల
మిగిలినవియెల్ల పసిఁడికి మిత్రకోటి
పసిఁడివైరులచే భంగపరచి హితులఁ
జొనిపి. యూదిన సున్నమౌ చోద్య మిశ.

తే॥ పసిఁడి సున్నమున సమస్త వస్తువులును
కట్టుఁబడి, లోహజాతులు, ఘనతఁజెంది
గురువులై లోక కళ్యాణ గుణము లెనయ
వెలయు చున్నవి విజ్ఞాన వీధు లందు.

-: పారద శత్రు మిత్రములు :-

సీ॥ హరిదంత పాషాణ మసిత పాషాణంబు
కాంతంబు, పెట్లుప్పు గౌరి యినుము
ఆకప్పురంబు, సద్యక్షార, మాఘాతి
చౌడు, మాక్షికమును చవిటిపూత
పొన్నంబరును మంచి పూరంబు కంకుష్టు
వహితులు రసమున కరసి చూడ
వీరంబు తొట్టి వెల్గారంబు తుత్థంబు
తామ్రంబు నాగంబు తాళకంబు

తే॥ రజిత మభ్రక మంజన ఘాయి, తిమురు
గలుగు ధాతు పగడపుట్ట గంధకంబు
మైలతుత్థంబు సీసంబు మణిశిలయును
అనవాక్షారమును మిత్రులగును శ్రీశ!

-: ఇనుము శత్రు మిత్రములు :-

సీ॥ చవిటి పూతయు నవక్షారంబు వంగంబు
గౌరి శిలాసత్తు గంధకంబు
అలకోడిగుడ్ల పెంకులు మణిశ్శిల కాకి
చిప్పలభ్రకమును శింగి మాక్షీ
కమ్ము, శంఖశిల వెలిగారంబు కంచు వై
రులు అయంబునకు కర్పూర పూర
నవరత్నములు వెండి నాగంబు కఫరియు
తామ్రంబు గంధక తామ్రములును

తే॥ ఆ సువర్ణంబు భూనాగ మామయూర
తామ్ర మత్యంత హితులయి దనరు కాంత
మునకు శత్రులు రాకాంత ముద్దకాంత
లక్కవన్నియ కాంతముల్ నిక్క మీశ.

కం॥ క్రిమముగ నలుజాతులు కాం
తముల కినుము శత్రు మిత్రతతియే నరిమి
త్రములగు నంచుఁ బ్రసిద్ధిగ
సుమబాణాపిత! అగస్త్య సూత్రము నుడివెన్.

-: నాగ శత్రు మిత్రములు :-

సీ॥ అండంబు పెట్లుప్పు అన్నభేదియు నెంౘడి
పెంకులు, మిరియాలు, వెండి కంచు
స్ఫటికంబు, తెల్ల పాషాణంబు, వస, సువ
ర్ణంబు, కల్లుప్పు వీరంబు శింగి
అభిని గుల్లయు వైరులగు, నాగమునకును
కాంత మభ్రకమును గంధకంబు
పారదంబును రాగి క్షారంబు హేమాక్షి
యసితసీసము మయూరాభ్రకంబు

తే॥ నవశిలాసత్తు గౌరి భూనాగములును
చెలుకు నాగంబునకు ముద్దుచెలులటంచు
సిద్ధపతి సర్వవిద్యా ప్రసిద్ధుఁడైన
నా యగస్త్యుండు వాక్రుచ్చెనయ్య శౌరి.

-: నల్ల సీసము శత్రు మిత్రములు :-

[-] నల్ల సీసము శత్రు మిత్రములు [-]

తే॥ కాకి చిప్పలు కాంతంబు గంణకంబు
కోడిగుడ్ల పెంకులు నత్తగుల్ల గౌరి
రాతిసున్నంబు సత్తులరాతు లగును
నల్ల సీసంబునకు నిది తెల్ల మీఁశ

తే॥ తగరము రసంబు భూనాగ తామ్రకేకి
తామ్రములు శీసమును నాగతామ్రములును
హితులటంచును బల్కుదు రెపుడు వైద్య
శాస్త్ర విదులైన పండితుల్ చన్నరాయ

కం॥ రసముల లోహాదుల నుపరస
ముల గుణగణము లెఱింగి రాజిలు వాఁడే
పసగల వైద్యుఁడు తెలియని
పసులమ దరిఁజేర్ప కీడువచ్చు రమేశా

[-] ఉపరస ద్రవ్య వివరణము [-]

వ॥ మఱియు ద్రవ్యంబులు, నుపరస మహారసంబు లనంబడునని రస సిద్ధులు వక్కాణింతురు. అందు నుపరసములు నూటాయిరువది సంఖ్యఁగూడి జగత్ప్రసిద్ధంబులైయుండు మహాసిద్ధిప్రదంబైన తురుశువు శ్వేత, పీత, రక్త, కృష్ణవర్ణంబులగు స్త్రభకంబును చతుర్విధ భేదంబులైన కాంతంబును, రాతినార సహస్రభేది, కర్పూర శిలాసత్తు, జాతి మదము, అంజనజాయి, నల్లజాయి, స్పటికవర్ణపుజాయి, సూర్యకాను జాయి, రాజపచుర్ధనపుజాయి, గరుడపచ్చజాయి, చిల్లపెంకుటిటికజాయి యెముక, వెంట్రుక, యెంద్రకాయ, చలువజాయి, పందికొమ్ము, దుప్పి కొమ్ము, యెద్దుకొమ్ము, మేకపాలు, పల్లుభూనాగము, ఆఖుద్రపుఉంగు సర్పరాజునకుందాహోదకంబుఁ గొనిపోవు నాగరవండు జంతువు, ఉప్పి చెట్లు నివసించు నత్తగుల్ల, యెఱ్ఱజలగ, కాకిచిప్ప, తాఁబేలు, కోడిగ్రుడ్డు

యేనుఁగు దంతము, ప్రవాళశుక్తి గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, నీలరత్న, వైఢూర్యాది, నవరత్నంబులు, గంధకశిలకప్ప, కుక్కుటము, భల్లూకము, మహానదు లందుదయించు శంఖము, కప్పవర్ణపు ఱాయి, శిలావంగము, శిలానాగము, అన్నభేది, అస్థిభేది, మాంసభేది, చవిటిమన్ను, నల్లయిసుక, రావి చిట్టెము, చక్కిముక్కిఱాయి, బిరుసురాయి, తేనెవర్ణపురాయి, పసుపువర్ణపురాయి, స్వచ్ఛపాషాణము, పందిముల్లు, సంద్రపు నురుగు, చేపముల్లు, ఎలికె ముల్లు, ముండ్ల శంకు, పెరోజవైయనంబడు వస్తువు, నాగపచ్చ, మంచిపచ్చ, పగడపుట్ట, తెల్ల పలుకురాయి, మృగోత్తమమగు గాండామృగము, కాకశిల, తగరపుటిసుక స్వర్ణపుటిసుక, నెమిలిఱెక్క, కాననశిల, రజితశిల, నాగశిల, తగరశిల, కంచుశిల, ఇత్తళిశిల, ఎఱ్ఱమన్ను, జాజి మన్ను, మేక కాలు, నల్ల తుమ్మెద, కస్తూరిమృగము, మేఘవర్ణపురాయి, సముద్రపుపాచి, సాల గ్రావము, మాంసశిల, దాళింబవర్ణశిల, దాళింబవర్ణమృదుశిల, కాశ్మీర స్పటికము, కావిరాయి, రాగియిసుక, వంగయిసుక, వెండియిసుక, లోహ మిసుక, నల్లస్పటికరాయి, కురువిందరాయి, హేమశిల, వంగశిల, రాగిశిల మొదలగునవి యుపరసంబు లనంబరగు. వాని గుణగణంబు లెఱింగించెద.

తే॥ తురుశు సున్నము రసమును ద్రుంచివైచు
వసుధ హేమాక్షికపుసత్తు పరుసమునకు
సోకి సున్నంబుగాఁ జేసి శుక్కువరచి
గురువుగాఁ జేయు లక్ష్మీశ! పరమపురుష

కం॥ ధర రజిత మాక్షికపు స
త్తురవడి రజితంబుఁజేయు దొడసున్నంబై
గురువగు కంచును మాక్షిక
సురచిరముగ కంచుఁజేరి సున్నము గురువౌ

ఉ॥ ఆరయ లోహమాక్షికము నాదగు సత్త్వవ లోహజాలముల్
సారము దూలి సున్నమయి చక్కని గుర్వగు కాకమాక్షిక
ద్స్ఫూరి ప్రకాశసత్త్వగని పొల్పుగ లోహములైదు నెట్టినా
సారెకు నభ్రకంపు ఘనసత్త్వవ సూతముఁగట్టు మాధవా

చ॥ సరసత రాతినార ఘనసత్త్వవ యూరస గుళ్కి కేర్పడన్
గరము జవంబొసంగు మణికాంతపు సత్త్వవ పుంసభావమున్
వఱలగ దేహసిద్ధి గురువార తదూపరసాలు సున్నమౌ
సరవి సహస్రభేదిఁదగు సత్త్వవ యా సౌరగంధి గర్వమున్
జెఱచునుగాని ఱాతిమీద సత్త్వవ నన్నిటఁగట్టి సున్నమౌ.

కం॥ అంజన ఱా యుపసరముల
రంజన బరిమార్చి సత్వరమ సీసమగున్
భంజన సేయును సరుకుల
నంజను నవి నల్ల రాయనంగ ముకుందా

తే॥ స్ఫటిక సూర్యాసురాలు నక్కటికతోడ
కాయ సిద్ధినిఁజేయును గాని చలువ
ఱాయి దేహంబులో వేడిరాణ యణఁచు
లోహ నవమును వేధయౌ లోహములనె

ఆ॥ గరుడపచ్చరాయి హరియించు విషముల
నెల్ల చిల్లపెంకు నెసఁగ రసపు
గుళిగె దోషమడఁచు కుంభిని యిటుకయు
దానికిచ్చుకాంతి దలఁప శౌరి

చ॥ ఎముకలవల్ల దేహమున కెంతొ ధృఢంబగు శక్తి గల్గు రో
మము వలనన్ దృతీయ కృప మండిత వీర్యపు గుళ్గి వెల్గెడిన్
సముచిత భంగి నత్తలను చాతురి నాల్కకు నబ్బు కర్కటం
బు మహిమతో రసము బోలగఁగట్టును చన్న కేశవా

ఉ॥ నాగర వండువల్ల గమనాయత దాహముదీరు ధాత్రిపైఁ
బాగుగ కాకి చిప్పయును మానక నా సౌరగంధి సీసమున్
వేగము మాపు కూర్మమున విశ్వము లోపల పాద మానకన్
వేగగు కోడి యండవుల పెల్చిన పెంకులుగూడి యొక్కడన్
మూగియు తెల్లతగ్రమును బూనిక నీరముఁ దీయు కేశవా!

కం॥ కరిదంతము పెట్లుప్పను
హరియించును పంది కొమ్మనం బాషాణం
బరవడి నెఱ్ఱగఁ జేయును
ధర నుప్పల మేక కొమ్మ దహియించు హరీ!

శా॥ పూవాగంబును జేరి పాదరస సంపూర్ణంబు సద్గుళ్ళికన్
గా నానావిధి మార్చి గుర్వగును లోకంబందుఁ గావించెడున్
దా నారుద్రపురుంగు మూలమున నంతర్గామమున్ గల్గు స
న్మానంబొప్పగ నెఱ్ఱజల్గ యటు సాత్మ్యన్ జేయు లక్ష్మీపతీ

సీ॥ కప్ప వల్లను దగ గగన మార్గంబులో
మాట్లాడగల శక్తి మహిమఁగలుగు
కోడివల్లను కాంతి గోరాడు చెక్కిళ్లు
మృదువులైయుండు సదృఢము గలుగు
భల్లూక కతమునఁ బరగు మార్గంబులో
స్తంబనం బొనరించు జాడఁ గలుగు
శంకువల్లను నదృశ్యాకారతను జెందు
ముత్తెపు సత్తుల ముదముతోడ
నానవాక్షారంబు నయరీతిఁ గట్టును
మహిముత్యమున రసం మణియు నగును
వేడ్క ప్రవాళంబు వేధించు రసమును
గోమేథికమువల్లఁ గోర్కి నింద్ర

ఆ॥ జాలవిద్యలొందవు చయ్యన నాపుష్య
రాగములన పృధ్వి బాగుమీర
నెల్ల గోప్యములను నెఱిగంగ నగు జుమ్మీ
భక్తహృత్ప రసిజ వాస! శ్రీశ

కం॥ రసవజ్రంబున సున్నము
లసదృశముగ కారమొందు వరయ మరకతం
ఖసమున రవి కిరణంబుల
దాప మాన్పియు మంచువోలె దూకొని చేయున్

ఉ॥ నీలము వల్లనాతురుశు నిల్చితిరంబుగ గుర్వుగా నగున్
దాలిమి రత్నకెంపులను ధాతువు తామ్రముగా జెలంగు స
త్తీలలల సర్వరీతుల వెలింగి విధూర్యము ఘోరసర్ప క
ల్లోల విషావికీర్ణచయలోకము వస్యముఁజేయు మాధవా

తే॥ గండశిలచేత నాగంబు ఘనత తామ్ర
మౌను నెంచ చూడాజాతి మహిమచేత
బలపజాయియే తాళక బలిమిఁ జెఱచి
సీసముగఁజేయు నేర్పుతో శ్రీనివాప

చ॥ మణిశిల తామ్రమవౌను ఘనమైన జవంబగు బిర్సురాయిచే
గణనము సేయ మండుకపు కాంతి చెలఁగెడి రాయిచే రసం
బణగియు గుళ్ళ—గంతులిడు భద్రశిలావృత వంగమా విషం
బణచియు బూదిసేయు నిది భద్రము జూడగ చన్న కేశవా

కం॥ భూరిశిలానాగంబును
జేరి సురాకారగుణము సిందూరించున్
ధీరతను నన్న భేదియు
నేరిమి నవరత్నములును నీరు వదల్చున్

ఆ॥ అస్తిభేదివలన నవరత్నములు నీరుఁ
జెందు స్వర్ణభేదిఁజేరి లోహ
సమితిఁ గఱఁగజేయు జక్క-మాంసపు భేది
యుపరసములనెల్ల నొంచు శ్రీశ

తే॥ చవిటి మన్నుపరసములఁ జక్క-పరచు
జాతిచిట్టెము దేహంబు రాయిజేయు
నల్లయిసుకను హేమంబు నరయ గురువు
గా నగును గాదె! తలపంగ కమలనేత్ర

ఆ॥ ఎఱ్ఱమన్నువలన నెసఁగ నల్లని సీస
మెలమి సుద్ద మన్ను వలన యినుమ
మేక కాలు వలన మేలైన వెండియు
తామ్ర మవును దివ్య తత్త్వ మూర్తి

కం॥ రస గుళిగె, నల్లతుమ్మెద
లసదృశముగ బేరమాడు నక్కిటి శల్యం
బసమున వనికే రసమును
బసగల మృదు రీతిఁ జేయు పంక జనాభా

ఆ॥ ముండ్ల యెలుకచేత మురువైన వీరంబు
తామ్రమౌను జలధితలములోని
నురుగుపెట్టుయుప్పు నొప్పార గట్టును
వైద్యులెల్ల రెఱుఁగ వలయు దేవ

కం॥ మీనమున ముండ్ల నిక్క-ము
గా నరయన్ గౌరి కట్టి ఘన సీసమగున్
బూనికను ముండ్ల శంకున
మానక నా శంఖ విషము మరగును శౌరీ!

కం॥ వారకను పెరోజానై
పారమున ఘన ప్రయాణ శ్రమఁ దొలగించున్
ధీరతను నాగ పచ్చయు
మీఱ నవాక్షర తామ్రమమేయగు శౌరీ!

సీ॥ మరకత పచ్చ తామ్రముఁజేయు నినుమును
పగడపు పుట్ట సొంపావహించి
వెలిగారమునుగూడి వెంట సిందూరించు
నలతెల్ల పలుకుఱ్ఱాల్ వలన తెల్ల
తగరంబు నీర్రుస్కు ధాత్రికదండురాల్
పాతాళ నిధులను బయలు పరచు
కాకశిలాశక్తి కాంతంబు తామ్రమౌ
గాండామృగము పాముకాటు నొంచు

తే॥ తెలియ కస్తూరి మృగము నీ దేహమందు
గలుగు కంపును బాపును గనుగొనంగ
సార మందారశిలఘనసార గుణముఁ
జెఱచి తామ్రమ్ముగాఁ జేయు శ్రీనివాస

కం॥ సాలగ్రావము చేఁగడు
మేలిమి బంగారు తామ్రమేయగుఁ జూడన్
చాలంగ మూంస శిలచే
లాలిత్యంబగుచు పాదరసము దృఢమగున్

కం॥ క్ష్మార పటిక మెంతయొ
విస్మయమున శివునిఁజూపు వేడుక గలుగున్
కశ్మలములేని కావి శి
లాశ్మంబునఁ దగరమెల్ల రహితామ్రమగున్

తే॥ రాగి నినుము సవీరంబు రమణతోడ
నాగమునరుద్ర వీర్యమ్ము నల్ల సీస
మలరు నిసుకను యింగ్లీక మహిమ తెలమి
ధరణి తామ్రంబుగా మారు దైత్య హరణ

కం॥ తెల్లని తగరపుటిసుకయు
మెల్లన వెలిగారమునకు మెరుపిచ్చియు దా
నెల్లెడల తామ్రమై చను
కల్లలు గావయ్య! వీనిఁ గనుగొన వలయున్

తే॥ రజిత మిసుకను గౌరి తామ్రమ్మె యగును
తాళకము హేమ మిసుకల తామ్ర మగును
లోహ మిసుకల మణిశిల యూహఁ దొలఁగి
తామ్రమౌగాదె! తెలియంగ దైవరాయ

చ॥ వెలయగ కేకి పక్షమున వేగమె చంద్రుని శీఘ్రమెల్ల వే
దొలఁగియు వేడి గల్గు మది దోపగ నల్లని పెల్సు రాయిచే
వలనుగ నశ్వదంతిశిలవైఖరి తామ్రముఁజెందు కానగా
శిలగమనంబు నిల్పునెట చిత్రముఁ జూడగ చన్న కేశవా!

కం॥ కురువింద రాయి యాయుధ
వరముల గర్వంబణంచు వరంజిత శిలా
భరమున తుత్థము గసరువై
చిరముగ సింధూర మగును శ్రీపూజ్య పదా!

ఉ॥ హేమశిలన్ ధరాస్థలి నహీనత సర్వశిలాదు లన్నియున్
ప్రేముడి సిందురించు నతివేగమ తెల్లని సీస సత్తుచే
సీమముతోడ దేహమున నెమ్మది మెళ్కువ నివ్వదెంచగన్
సామత నల్లసీస ఘనసత్తువ తామ్రముఁజేయు వేగ లో
కామయరూప! కప్పురము గర్వమడఁచియు నిద్దరాస్థలిన్

ఆ॥ కంచు లోహమునను గడుసురా కారంబు
తామ్ర మగును పాకధర్మ సరణి
తామ్ర మగును జూడఁదగ సురాకారంబు
నిత్తడి వలన గడు నిందిరేశ

తే॥ తామ్రమున జాతి యుప్పులు తామ్ర మగును.
నిత్తడియు సురేకారంబు నెసగ మెసగ
తామ్రముగఁ జేయు నీవిధుల్ తప్పకెప్డు
తెలియు నాతఁడు వైద్యుండు దేవ దేవ

(-) చౌషష్టి పాషాణములు సత్తుచేయు విధము (-)

కం॥ కల్లుప్పు వీరసున్నము
తెల్లని సున్నంబు మూడు దినుసులు సమ పా
ళ్లెల్ల నాక ఫలము చొప్పున
మెల్లగఁ జేకూర్చి యన్ని మెదచిన పిదపన్

తే॥ చెలగ పెట్లుప్పు జయ నీరు చేత గలపి
యింపుగా నూరి పాషాణ మేదియైన
నొక్క పాషాణమునకు దావొక్క మూరు
నాల్గు ఝాములు జరికింప నదియె శుద్ధి

సీ॥ బాడిస కుప్పెంట వామింట మోదుగు
కాకర, పావిట యాకు లెలికె
చెవ్వాకు చారును చిత్రేకు బూడిద
గుమ్మడికాయ రసమ్ము బాల
నరుని యల్పాచమాసము ఖర మూత్రమ్ము
కడుపుల్సి యున్నట్టి కాడి జలము
జాతి సున్నము పునర్ణవి గురిగింజాకు
మేక మూత్రము తుమ్మియాకు వావి
లాకులు తాటికల్లచ్చపు పూనీరు
శంకు భస్మము యివి సమము పాళ్లు

తే॥ పడి ప్రమాణంబు పసరులు కడవలోన
బోసి మూతికి గుడ్డను బొసఁగ గట్టి
యెట్టి పాషాణమేని యింతింతఁ బెట్టి
వండవలె రసంబిగురగ పద్మనాభ

క౦॥ పిమ్మట నప్పాషాణము
సమ్మతముగ దీసి కాడి జలమందునఁ దా
నెమ్మదిగను గడుగుచు నీ
రమ్మునఁ బరిశుద్ధిచే కురగ నద్దానిన్

తే॥ ఆ సురాకార జయనీరమందు నాల్గు
ఝాములును జారికించి తక్షణము దీసి
శంకు సున్నము తుత్థము చవిటి పూత
జాతి సున్న మీ నాల్గు చూర్ణమును జేసి

తే॥ ఆ సురేకార జయనీరమందు గలిపి
మైనముగ నూరి సర్వ పాషాణములకు
నెలమి కవచంబులిచ్చి చీలిచ్చి చిన్న
పుటమిడిన సత్త్వ ముదయించు పుణ్యరూప

క౦॥ ఆ సత్తుకు సమపాళ్లుగ
వాసిగ టంకణము గలిపి పంతెల లోనన్
వేసియు చీలిడి కొలిమిని
భాసురగతి నూద నొదవు వరసత్త్వంబుల్

క౦॥ అరువది నాలుగు విధముల
వరపాషాణములు నిట్టి పద్ధతి వలనన్
గురుతర సత్త్వము లెనయగ
సరసతఁ దియ్యంగ వచ్చు సద్వైద్య లిలన్

క॥ రసగంధక మపరంజియు
పస గలిగిన సత్తు ఫలము వంతున మూసన్
వెస గూర్చి సిందురింపుచు
మెసవినచో మేని ఛాయ మిసిమిన్ దేలున్

(-) సరుకులు కరిగి పోయుటకు మిశ్రములు (-)

సీ॥ టెంకాయ నీరమ్ము పొంకపు తేనెయు
మేలిమి మేకల పాలు నెయ్యి
ఇప్ప పువ్వు రసంబు తిప్ప బొంత జముండు
రసములు సమపాళ్లు నెసఁగఁ గూర్చి
భాండంబులో బోసి రెండు ఫలములు చొప్పు
నా నానవాక్షారంబు నల్ల గాజు
వెలిగారమును యన్ని నులి చూర్ణ మొనరంచి
యందిడి కలగల్పి మందులోన

తే॥ స్వర్ణ తామ్ర రజిత నాగవంగ లోహ
సరుకులను ముంచి ముమ్మారు గఱఁగి పోయ
సకల కల్మష లోహ దోషములు మాను
భక్తవత్సల! గోవింద! పద్మనాభ!

[-] మూలికా తామ్ర విధానము [-]

సీ॥ ఎఱ్ఱ బచ్చలి నీలి యెఱ్ఱ తామర పువ్వు
నెఱ్ఱల్లి పువు చాతరేసియాకు
అడవి మల్లేకు దొండాకెఱ్ఱ చాతరే
సెఱ్ఱగల్గర చిఱ్ఱి యెఱ్ఱ చిత్ర
మూలంబు వేర్వేర మేలిమి రసములు
దీసి భాండమ్మునఁ బోసి యందు
కోడిగుడ్ల కరువు గురిజ గింజల పప్పు
పటికారమును నూరి పరగ గలిపి

తే॥ మూడు దినములు నానించి ప్రొయ్యి నునిచి
పాక మొనరించి పొంగులు వారఁ గాంచి
తెలినవాక్షర మిందుప్పు వెలియుగార
మమలముగ మైన మొనరించి యందులోన

కం॥ కలుపుచుఁ బసరింకిన తఱి
తెలిసియు కుండకును మూత దిట్ట తనిడి చీ
లలరించి వండిరేనియు
వలి బూడిద యగును యట్టి భస్మంబునకున్

తే॥ గురిజ గింజలు టంకంబు గుడము తేనె
గోఘృతంబును యష్టాంశ గూర్చి పదవ
పాలు పెట్లుప్పుఁ జేర్చి కల్వమున నూరి
మూసఁ గఱఁగిన తామ్రంబు వాసిఁ గాంచు

[-] మూలికాసీస విధానము [-]

సీ॥ తెల్ల గల్జరు తిప్పతీగ చెకొణితాకు
దొండ సొజ్జయు బొద్ది దుష్టపాకు
నేలగొరిమిడాకు మేలైన పొనగంటి
చెప్పుతట్టాకు లింపొప్పఁ దెచ్చి
సమపాళ్లు పత్ర రసమ్ములు దీయుచు
మునుపటి పగిది భావనలు జేసి
సీస సత్తువ దీసి సిద్ధ బద్ధ రసంబు
దినినంత తినిపించి-కనుగొనంగ

తే॥ రసఘుటిక బెండుగాకుండు మిసిమిదేలు
జారణము జేసి పుటమిడి చల్లఁ బరచి
యుత్తెఱంగున నిర్వదియేను మార్లు
సత్తు ద్రావిన గుళిగె మహత్తుఁ గాంచు

కం॥ ఈ వైభవ రస ఘుటికను
కేవలముగ దాల్చు వారికిన్ నిత్యంబున్
శ్రీవస్యము జనవస్యము
గావలసిన వైభవములు గలుగున్ జగతిన్

[-] నూటా యిర్వది యుప రసములు సత్తు తీయు క్రమము [-]

సీ॥ కల్లుప్పు పెట్లుప్పు పుల్లటి కలి ఖర
మూత్రంబు పటికయు బూడ్దిరంగు
గుమ్మడికాయ రసమ్ము మానిసి మూత్ర
మిందుప్పు సమపాళ్ల నెనయ గొనుచు
కుండలో గలబోసి గుర్తుగా దానికి
యేదేని యుపరసం బిచ్చఁ గొనుచు
నునుపుగా చూర్ణించి నునుపైన గుడ్డలో
వదులుగా ముడివైచి భద్రపరచి

తే॥ డోలికాయంత్ర విధి దాని మేలిమిగను
కుండలో నీరమింకిపో వండి తీపి
కాడిలో వేసి కడిగియు కడకు దీసి
యయ్యుపరసమ్ము నెండించి యవలఁ బెట్టి

కం॥ మీఱ నవాక్షారము వెలి
గారము గురిగింజ తేనె కమ్మని వెన్నన్
పీరము నాముద పప్పును
సారముగల చవిటి పూత చక్కని గుడమున్

సీ॥ ఒంటొండు ద్రవ్యంబు రెండు ఫలంబులు
చక్కని పెట్లుప్పు నొక్క ఫలము
నెన్నికఁ దులతూచి యన్నియు గల్వాన
పెట్లుప్పు జయనీరు వేసి నూరి
మూడుపాళ్లును జేసి ముందుగా నొక పాలు
నయ్యుపరసమున నమర గలిపి
యన్నిట మర్ధించి యపుడె మూసను జేర్చి
కొలిమి నిప్పుల గూర్చి చెలిమి తోడ

తే॥ నూదిరేనియు సత్త్వము నుదయ మగును
అట్టి సత్తువ కొంకపాలు నౌషధంబు
గలిపి మర్ధించి మూసలోపలను జేర్చి
పొసంగ నిమ్మాద్కి రెండేసి పుటము లిచ్చి

కం॥ కొనినట్టు సత్తు వేతాక
ఘనమూసను జేర్చి కరిగి కాల్చిన టంకం
బును చిట్కా వైచుచు నో
ర్పున మిత్రముతోన వంచి పొలుపుగ దానిన్

కం॥ రస ఘుటికకుఁ జురికించిసఁ
బసనీనుచు బద్ధగించి భద్రము గాదే
వ్యసనముఁ బడవేలా? ఉప
రసములు సత్త్వమగు వైద్యరాజులు మెచ్చన్

[-] పంచ భూత వర్ణ నిర్ణయము [-]

శా। నేలన్ నీరును నిప్పు గాలి చదలీయేన్ బంచ భూతంబులా
మూలాంశంబులు పారదాద్యుప రసంబుల్ సర్వ పాషాణలో
హాళిన్ గూర్చి వచింతు వర్ణములు నాద్యంతంబు విశ్వేశ! పు
ష్పాలంకార మహామణి స్ఫురిత వక్షా! చన్నరాయధిపా!

చ॥ పటుతర భూమికిన్ పసిఁడి వర్ణము నీటికి నిర్మలద్యుతిన్
పటిమ రహించు వహ్నిలకు వర్ణము తామ్రము మేటిగాలిక
ప్పటమున నుండు నల్పుగల వర్ణము నద్దివి ధూమ్ర వర్ణమున్
జటులతనొప్పుచుండునని చాటె నగస్త్యుడు శ్రీరమాధిపా!

సీ॥ వెంట్రుకల్ చర్మాస్తి పెనుకండరంబులు
నరములు భూమి జన్యంబు లగుట
తెల్ల నీరును మూల్గు తెల్ల మాంసపు జవ్వ
రక్తంబదెల్ల వార్యంశ మగుట
ఆహార నిద్రాభయ క్రోధ క్షోభముల్
వహ్నితేజాంశ సంభవము లగుట
ఆకుంచిత ప్రసారాది కృత్యంబులు
సంచలనము గాలి యంశంబు లగుట
ఆశ్చర్యలోభ మహాకామ మోహాదు
లహము లాకాశ జన్యంబు లగుట
మలజలమ్ములు భూమి సలిలాంశ మగుట హృ
ద్రక్తంబు వహ్నితత్వంబు నగుట

తే॥ స్తన్యముమినీరు గాలి యంశంబు లగుట
కడిమి శుక్ర శోణితము లాకాశ తత్త్వ
మగుట నెఱుఁగ వలయు వైద్యులైనవారు
అవని నీ యైదు గురుపంచ కాఖ్యఁ దనరు

కం॥ భూయంశము బంగారము
ఆయసితపు సీసమెల్ల నప్తత్త్వమగున్
శ్రీయగు తామ్రము తేజం
బాయయ మనిలమ్ము సత్తునాగము చదలౌ

తే॥ అమ్మహా పంచభూత లోహముల లోన
చిత్కళంక భస్మాదులు సిందురములు
వాని నెఱిఁగి ప్రయోగింప ఫలము కద్దు
కలదటంచును బలికె నక్కలశ భవుఁడు

(-) పంచభూత లోహశుద్ధులు (-)

[-] బంగారు శుద్ధి [-]

తే॥ కావిజాళ్ళను సననిమ్మకాయ రసముఁ
గూర్చి మర్ధించి పైడిరేకులకుఁ బూసి
నిప్పు కొలిమిన మున్మార్మరులొప్పఁ గాచి
రేని శుద్ధియై బంగార మింపెసంగు

(-) రాగి యినుము నల్ల సీసము శుద్ధులు (-)

సీ॥ గురిగింజ పెట్లుప్పు సమముగా పటికయు
సననిమ్మ పండ్ల రసాన నూరి
తామ్రరేకుకు రాచి తర్వాత కొలిమిలోఁ
గాచి గాడిద మూత్రకమున నేడు
సారులద్దానిని సరసముంచిన శుద్ధి
ఇనుపరాపొడి పాత్ర నునిచి నిమ్మ
రసమున త్రిదినముల్ వెస నూరబెట్టుచు
కడిగియు తప్త కల్వమునఁ జేర్చి

తే॥ రాణ నెత్తుల్లి గడ్డల రసము తోడ
నూరి మూసలోఁ గఱఁగఁ జేకూరు శుద్ధి
నల్ల సీసము మూసలో మెల్ల గఱఁగి
మంచి కలుబందలోఁ బోయ మంచి శుద్ధి

ఆ॥ నాగ మేడుమార్లు నయముగా గఱగించి
యిప్ప నూనెలోన నెత్తిపోసి
రేని శుద్ధి యగును యీ యైదు ధర పంచ
భూత లోహములన ఖ్యాతిఁ దనరు

[(] కారసార పంచభూత వివరణము [)]

సీ॥ కల్లుప్పు పెట్లుప్పు కర్పూర మిందుప్పు
తుత్తంబు చవిటుప్పు సత్తి యుప్పు
సీరుప్పు నా నవాక్షారంబు టంకంబు
నీ పదింటిని పరీక్షించి పంచ
భూత లవణములఁ బొల్పార గుర్తింప
నిందులో వాదంబు నిమిడి యుండు
గురుభస్మ సిద్ధాంత గురువుల కీ యైదు
ధాతిక లవణంబు లే తెరువున

తే॥ నైన సరుకుల కట్టుకు మైనములకు
స్థానమై యుండు నై దింటిలోన నొకటి
తొందరమ దప్పెనేని తద్యోగమెల్ల
నిష్ఫలంబై చెడు నిజమ్ము సీరజాక్ష!

-[ పంచభూత లవణ లయక్రమ విధానము ]-

సీ॥ కల్లుప్పు యిందుప్పు క్ష్మాయంశ మప్పులో
లయమగు చుండును క్రమముఁగాను
సత్తియుప్పును నవాక్షారంబు సలిలాంశ
మగ్నిలోఁ జూడ లయమ్ము గాంచు
పెట్లుప్పు చవిటుప్పు వేడ్క తేజాంశమ్ము
గాలిలో లయమగు గాంచిరేని
వెలిగార తుత్థముల్ దెలియ వాతాంశమ్ము
ఆకాశమున లయంబగును జూడ

తే॥ కప్పురంబును పటిక సీరుప్పుఁ దెలియ
నద్దివాంశంబు బయల లయమ్ముఁ బొందు
కనుఁడు వాదసిద్ధాంత చక్రంబొకండు
భక్తవత్సల! గోవింద! పద్మనాభ!

వ॥ సత్తి యుప్పు శక్తియుప్పని యందురు. స్త్రీ వాచకము కనుక స్త్రీల కాభరణము గాజు. అందువలన గాజుప్పుకు సత్తియుప్పని పేరు.

ఆ॥ అచలమప్పు నందు నప్పు తేజంబున
తేజ మనిలమందు తివిరి యనిల
మాకసమ్ము నందు నాకసమా! బయ
లందుఁ దెలియ లయముఁ బొందు నిజము

-[ పంచ భూత పాషాణముల వివరణము ]-

తే॥ పగడ పుట్టయు తొట్టి కార్మొగిలు శింగి
తిమురు పాషాణ ధాతువుల్ గ్రమము గాను
పుడమి తత్త్వాంశమనుచు నమ్మునివరుండు
నైదిటిని గూర్చి పలికెను వేద వేద్య

తే॥ అరయ కుక్కుట గౌరి శిలాశ్వదంత
శ్వేత పాషాణములు శంఖ శిల ప్రసిద్ధి
నైదిటను వారి తత్త్వాంశ మగుటఁ దెలియ
బలికె నయ్యగస్త్యుండు పద్మనాభ

కం॥ హరిదళము గంధకంబును
సౌరగంధియు తాళకమ్ము శుద్ధస వీరం
బురు తేజాంశము లంచును
పరమ తపోధనుఁడు మౌని వల్లభుఁడనియెన్

ఆ॥ వసుధ పుల్తొట్టి సర్కాండ పంచ పక్షి
ఆమణిశ్శిల రక్త పాషాణములును
వాయురాంశంబులై యెప్డు వాదములకు
స్థానమై యుండునని చాటె తపసి యభవ

కం॥ రస మింగ్లీకము కోశ్త్రల
పసగల లింగంబు కాక పాషాణము త
ద్రస శాస్త్ర పండితులకా
కసపుం దత్త్వాంశమంచగస్త్యుఁడు నుడివెన్

-[ ఉపరస పంచభూత ద్రవ్య వివరణము ]-

సీ॥ కాకి చిప్పలు శంకు కంచు సూర్యాకాన్ తాయి
ఆర్ద్ర పురుగు సహస్ర భేది
అస్థి శిలాసత్తు నన్న భేదెంద్రి య
భ్రకము భూనాగంబు బాలకురులు
కట్టి తుత్తంబయస్కాంతంబు రాజ వ
ర్ధనమును మేలైన రాతినార
అల కోడిగుడ్ల పెంకులు మాక్షీకము నెటఁ
గనుఁగొన్న క్ష్మయంశ గలిగి యుండు

తే॥ అవని నాగరవండు వార్యంశమునను
నెమలి తెక్కలు వహ్ని తత్వమున తాతి
మద మనిల తత్త్వమున నమృత మృదు శిలలును
గగన తత్త్వాంశమున నెప్డు జగతి వెలయు

తే॥ తలప కార్స్వార పంచభూతముల లోన
ధరణి పాషాణ పంచ భూతములు లయము
బొందు వైజ్ఞాని విజయంబు పుడమి నొందు
అహిత జన కోటి మదభంగ! శ్యామలాంగ

చ॥ ఉపరస పంచ భూత శిలయోగ సమిశ్రమ చిత్కశంకముల్
సుఫలద సిందురంబులు విశుద్ధపు లోహముల్ందుఁ జేర్చినన్
సఫలము బొందు కార్యములు క్ష్మస్థ లిభూతములైదిటన్ బ్రమా
దపరత యోగమందొకటి తప్పినఁ గార్యముగాదు కేశవా!

# వ సిద్ధాంత చక్రము

| క్షారసార లవణములు | శత్రువులు | అంశలు | లయక్రమం | పాషాణ పంచభూతములు | పంచభూత లోహములు |
|---|---|---|---|---|---|
| 1) కల్లుప్పు | ఇందుప్పు | పృధివి | అప్పులో లయము | పృధివి, తొట్టి, కార్మాగిలు, పగడపుట్టు, శింగితిమురు పాషాణములు | బంగారము పృధివి యంశము |
| 2) సత్తియుప్పు | నవాక్షారము | అప్పు | అగ్నిలో లయము | అప్పు=గౌరి, శంకు, కుక్కుట, అశ్వదంత, తెల్ల పాషాణములు | నల్ల సీసము నీటి యంశము |
| 3) పెట్లుప్పు | చవిటుప్పు | అగ్ని | వాయువులో లయము | అగ్ని=తాళకము, సవ్వీరము, గంధకము, హరిదళము, సౌరగంధి పాషాణములు | తామ్రము తేజో యంశము |
| 4) వెలిగారము | మైలతుత్థము | వాయువు | ఆకాశములో లయము | వాయువు=పుల్త్రొట్టి, పంచపక్షి, సర్పాండ మణిశిల, రక్తపాషాణం | ఇనుము గాలి యంశము |
| 5) పచ్చకర్పూరము | పూనీరు పటిక | ఆకాశము | బయలులో లయము | ఆకాశము=లింగ, కాకకోడితల గెంది, ఇంగ్లీకము, రసపాషాణములు | సత్తునాగము ఆకాశాంశము |

-] జయనీరు ప్రకరణము [-
-[ వెడియుప్పు జయనీరు విధానము ]-

సీ॥ వెడియుప్పు జయనీరు విధము వాక్రుచ్చెద
పెట్లుప్పు దశదీక్ష విధుల దీర్చి
రమణ పండెండున్నర ఫలంబు లమల పూ
నీరు సున్నము పటికార సున్న
మొండొండు ఫలము చొప్పునఁ గొని తుత్థంబు
గంధక లవణంబు కప్పురంబు
ఉత్తరేణుప్పు కల్లుప్పులుం సైంధవం
బుదధి ఫేనము జేసి యుప్పు అన్న

తే॥ భేది వెల్గార ద్రవ్యముల్ వేడ్కఁ రెండు
ఫలము లను చొప్పు నీరమ్ము ఫలము మూత్ర
ముప్పు ఫలము నందునఁ జేర్చి గొప్ప కల్వ
మునను మంచు నీరమ్ములో మునుపు నూరి

తే॥ నిమ్మ పండ్ల రసంబున నెమ్మదిగను
తెల్ల జిల్లేడు పాలతో దిట్టముగను
పిల్లవాఁడ్ర మూత్రమిమ్మడి వేడ్కఁ ఝాము
చొప్పునను లెస్స మర్ధించి చూచి మరియు

తే॥ కోడిగుడ్ల తెల్లటి కర్వుఁ గూర్చి నాల్గు
ఝాములు నూరి మైనంబు సాటి దీర్చి
అసదు బిళ్లలుగాఁ జేసి యారనిచ్చి
యెండలో తీవ్రముగ దాని నెండఁబెట్టి

కం॥ చానిగలఁ జేర్చి చీలిడి
భానుని కిరణాల నునిచి పది నుగ్గులలో
మానుగ పుటమును బెట్టియు
దానినిఁ జేకొనఁగ వలయు తామర సాక్షి1

కం॥ దీనికి నాలుగు భాగము
లానవసారమునుఁ జేర్చి యట నూరియు పిం
గాణీ నునిచి మంచున నిడ
గానీరగు బుడ్డి నిండుగాఁ బోసి యటన్

కం॥ వెస నీ జయ నీరునఁ దగ
వసనాభియు పునుగు వీరపాషాణంబున్
రస కప్పూర కురువండులు
అసదృశముగ వరహా చొప్పు నందిడి రేనిన్

కం॥ ఈ వెడియుప్పు ద్రవంబును
జేవను నొప్పారి చెడదు శ్రేష్టంబగుటన్
కావలిసిన వాటికి నిడఁ
గావలయును వైద్యవరులు కంజదళాక్షా!

(-) జయ నీరు (-

సీ॥ సర్వీరమును నవాక్షారంబు పూ నీరు
నొక్కొక్క ద్రవ్యంబు మిక్కుటముగ
ద్వాదశ ఫలములు వంతున సమకూర్చి
కల్వ సన్నిధిఁ జేర్చి కలయ నూరి
గాజు తట్టలఁ బోసి రోజును రాత్రిళ్లు
మంచు బారెడు చోట నుంచిరేని
జయనీర మూరును క్రియతోడ ప్రతి రోజు
భద్రంబుగా నిట్లు వారి యెల్ల
మొత్తంబు సీసాల కెత్తుచు పునుగు పూ
రము కురువండు చూర్ణములు గలిపి

తే॥ వాత చీల బిగించి కావలసి నపుడు
సరుకు గుమి నందులో ముంచి సమ్మతముగ
వాడ్చిరేనియు గట్టును ఫలము కద్దు
అమల గుణధామ! శుభనామ! సమర భీమ

-[ వన్నె కట్లకు జయ నీరు ]-

సీ॥ ఉప్పును మంచి పెట్లుప్పు నవాక్షార
మును సైంధవ లవణము గురిగింజ
గింజలు లింగంబు కేవల మొక ఫలం
బెన్నికఁ దుల దూచి యిందులోన
రెండున్నర ఫలంబు శ్రేష్టమౌ గంధక
ద్రవ్యంబు కల్వానఁ దప్పకునిచి
మొదట నవాక్షారమును సురాకారంబు
నూరిన తర్వాత నున్నవన్ని

తే॥ మెదిచి పిమ్మట గంధకం బెలమి గూర్చి
చూర్ణముగ నూరి పింగాణి శుభ్ర పాత్రఁ
జేర్చి జేల మంచున నది చెమ్మ గిలగ
నేట వాలుంచ జయ నీర మింపుగొల్పు

కం॥ ఈ వన్నె కట్టు జలమున
గావలసిన సరుకులెల్ల గట్టును తామ్రం
బీవారిఁ దవిలి మేల్మిన్
గేవలముగ శుద్ధియగును కేశవ! వినుమా॥

-[ గంధక జయ నీరు విధము ]-

తే॥ అమర శిలనామ గంధక మైదు ఫలము
లాజరార్క వత్ర రసాల నమరనొక్క
దినము మర్ధించి గాజుతట్ట నిడి తెల్ల
వారిఁ జూచిన దేరిన నీరమెల్లలో
కల్వమున బోసి తన్మూలికా రసాన
నూరి యట నుంచగా జయనీర మూరు

కం॥ ఈ నీటిచేత లింగము
స్నానము గావించి వాడ్చినం గట్టును యే
యేనవ్య ద్రవ్యంబులు
నేనియు యీ నీటి చేతనేగట్టు హారీ!

-[ పెట్లుప్పు జయ నీరు ]-

కం॥ పెట్లుప్పు చింతపండును
అట్లే సమతూక మొప్ప నట నూరి తగన్
చిట్లగ గాలిమిని యూదిన
నట్లే యగు బుగ్గు దాని నట నూరి విధిన్

ఆ॥ గాజుతట్టబెట్టి కనుఁగొని దిగువగా
గాజుతట్ట నునిచి గాలి లేని
జాగ బెట్టి గంప బాగుగ మూసియు
తడిని గుడ్డ గప్పి తక్షణమున

కం॥ మంచు గురియు చోటను గమ
నించుచు నుంచినను యుప్పు నీరంబగు నం
దుంచిన వాడ్చిన నరుకులు
గాంచినచో గట్టు వన్నె కట్లకు వచ్చున్

- సుంధర జయ నీరు -

సీ॥ గంధకంబును సురాకారంబు వీరమ్మ
లీల ముత్తెపు చిప్ప తాళకంబు
పది ఫలంబుల చొప్పు ప్రతి వస్తు ౯కాని
పూనీరు సున్నంబు నేను వరహా
లెత్తును ద్రవ్యాల బొత్తుగా నిడి నూరి
పొడిచేసి దుత్తకు బోసి మఱియు
పంద్రెండు పళ్లను వారియు బూరించి
మేలి బానను మూసి చీల చేసి

తే॥ నాల్గుఝాములు వండిన నవతరముగ
ద్రావణంబగు నిట్టి నీరమ్ము నందు
సరుకులును గట్టి సున్నమై మెరయుచుండు
తుత్థమును ముంచి యెండించి తొలఁగ దీసి

తే॥ తెల్లగంటెన మూలిక వేళ్ల నూరి
అట్టి తురిశికి కవచంబుఁ జుట్టి బట్ట
చీలమన్నిచ్చి యెండించి చెలఁగ మూడు
చిన్న పిడకల బుటమిడ సున్నమగును

కం॥ ఈ జయ నీరున హింగుళ
రాజము తాళకము శంఖు రాట్సువీరం
బా జయ గంధక మరవై
తేజపు సరుకులును ముంచి తీసినఁ గట్టున్

సీ॥ తురుశు సున్నము నొక్క వరహా యెత్తును దూచి
కలబొంద పాలలో గలిపి వేసి
యొక ఫల మింగ్లీక మొక పెంచుపైఁ బెట్టి
దీపాగ్ని మంటను దోపఁ జేసి
నాలుగు ఝాములు నయముగాఁ జారికించి
రేనియు కట్టును మైనమగును
మైనంబు గింజెత్తు తేనెతో దిన్నను
సంధి జ్వరంబులు సకల వాత

తే॥ రోగములు మాను నలుబదిరోజు లెలమి
మందు సేవించిరేనియు మహిమ మీఱ
గుల్మ శూలలు కరిమేహకులము క్షయలు
ఘోర మేహ వ్రణంబులు గూలు నభవ

-[ పథ్య క్రమము ]-

తే॥ అరటి పూలేత వంకాయ లావు నెయ్యి
మేక మాంసంబు నెండు చింతాకు పులుసు
పొన్నగంటాకు నుసరిక పులుసు నావు
మజ్జిగయు బెండకాయల గుజ్జు మెక్క
వచ్చు పులుసు చుట్టలు పొగ వర్జ్య మీశ

-[ ఆనంద జయ నీరు ]-

సీ॥ ఆనంద జయవారి కవసర మైనట్టి
సిద్ధిగ దీక్ష చేసిన కిళింగి
పది ఫలంబులు వీర పాషాణ మానవా
క్షారంబు నయ వెలిగార మొక్క
ఫలము లెక్కను గొని పచ్చ కర్పూరంబు
పునుగును కురువండు పొనఁగ రెండు
వరహా లెత్తును చొప్పు వరలఁ గల్వముఁ జేర్చి
వెసనూరి పంతెలఁ బెట్టి మందు
లఘు పుటంబిడి శీతలమునఁ జూచిన సున్న
మైయుండు నీ సున్న మలర గాజు

తే॥ పాత్రలోఁ బెట్టి వెడలుపు బాన నునిచి
యమల జయ నీరుఁ దీసి నీరంబు నందు
కాంచి సరుకుల నద్దుచు ముంచి ముంచి
నిప్పులో వాడ్చినను గట్టు నీలవర్ణ

కం॥ సరుకులు సున్నంబగు వి
స్ఫురగతి భస్మంబు లగును సూతఘటిక సిం
దురమై రుజ నణఁచును సుం
దర తర మానందవారిఁ దాకిన వెల్లన్

:- సర్వీర జయ నీరు -:

సీ॥ తెల్ల వంగము వరా తీక్ష్ణాగ్నిఁ గఱగించి
యొక వరా పారద మొకట గలిపి
నూరిన భస్మాన వీరంబు నొక వరా
తగ నూరి పింగాణి తట్టలోన
బెట్టుచు దిగువన పింగాణి నుంచిన
పెట్లుప్పు జయ నీరు విధము దిగును
సరుకుల కుపయోగ పరుప వచ్చును యిద్ది
దివ్యమై యుండును దేరిచూడ

తే॥ వీర జయ నీర మన నొప్పు వేడ్కఁ గొలుపు
సకల సరుకుల గట్టును శాస్త్ర విధుల
సూత్ర మెఱిఁగిన ద్రవ్యంబు సున్నమగును
మేసకుల తిమ్మపతి పోష! మేది సీశ!

[-] ముప్పు సున్న విధానము [-]

సీ॥ మంచి నీరములోనఁ బెంచిన కాకి చి
ప్పల పొడి రజిత లవణము పటిక
ప్రతి ద్రవ్య మొండొండు పది ఫలంబుల చొప్పు
గొని కల్వమునఁ జేర్చి ఘనముగాను
జయ నీర మిడి నాల్గుఝాములు మర్దించి
గుండు బిళ్ళ యొనర్చి యెండబెట్టి
చట్టిలోపల నుంచి గట్టి చీల లొనర్చి
గజ పుటంబిడి చూడఁ గాంతి గలిగి

తే॥ శుద్ధమైనట్టి కారపు సున్న మగును
యిట్టి సున్నము సరుకుల నెల్ల జంపి
సున్నములు జేయు నిది ముప్పు సున్న మీశ
సున్న మెఱుఁగని రసవాది యెన్న దున్న

-( తురుశు సున్నము )-

సీ॥ పైన జెప్పిన ముప్పు సున్నంబు వీరంబు
నీ రెంటిఁ గడు జయ నీరు చేత
మంచి కల్వములోన మైనమువలె నూరి
మందు సమాంశము మైలతుత్థ
మున కథరోత్తరములు గాగఁ బట్టించి
చీలమన్ను లొసంగి శీలముగను
లెక్క తెలుసుకొని యొక్క పుటంబిడ
తురిశున్నంబౌను పరమ తురిశు

తే॥ సున్నమున ద్రవ్యములు సోకి సున్నమగును
యిట్టి సున్నంబు సూతంబుఁ గట్టివైచు
గట్టినట్టి రసముఁ గళంకములఁ జేర్చ
నీచ లోహము పసిఁడియౌ! నీలవర్ణ!

-( నవాక్షార సున్నము )-

సీ॥ గవ్వపూనీరును కలిపిన సున్నంబు
నానవాక్షారంబు నాణెమైన
మైలతుత్తపు సున్నమాసురాకారంబు
వీరంబు గడు జయ నీరు చేత
కల్వసన్నిధి నూరి కడుమైన మొనరించి
బిగువుగా మర్ధించి బిళ్ళఁ దట్టి
యెండించి పంతెల నిడి చీల బంధించి
కుక్కుట పుటమును గూర్చిరేని

తే॥ కారమును గల్గి సున్నమై ఘనత మీఱు
క్షార సున్నంబిదియె నవక్షార సున్న
మనఁగ విజయ సున్నంబన నాఖ్య నమరు
కొమ్ములో చీల వంటిది కువల యేశ

() కల్లుప్పు సున్నము ()

కం॥ హారతి కర్పూరము స
ప్వీరము కల్లుప్పు నేల వృద్ధియగు సురా
కారము నూత్న క్షారము
చూరును గావించి తురిశు సున్నము గలియన్

తే॥ కల్వమందుంచి జయ నీరుఁ గలిపి నూరి
బిళ్ళ మొనరించి యెండలోఁ బెట్టి దాని
పెంతెలందుంచి చీలిచ్చి పిడక పుటము
వన్నెగాఁ బెట్టి కారపు సున్నమగును

కం॥ కల్లుప్పు సున్న మిద్ధర
సల్లలితము వైద్యవాద శాస్త్రము లందున్
గొల్లలుగ గీర్తిఁ గాంచెను
కల్లుప్పును గలుపకున్న గలవే ముక్తుల్

)-( వెలిగార సున్నము )-

కం॥ వీరము పెట్లుప్పును వెలి
గారము కటిమైలతుత్థ ఘన సున్నంబున్
మీర జయవారిచే గడు
నూరియు పుటు మిడిర యేని మసి సున్నమగున్

కం॥ ఈ కారపు సున్నము ధవ
ళా కారము లోహ జాతులం ద్వరితగతిన్
జేకొనఁ గఱగించును ల
క్ష్మీకాంతా! టంకణాఖ్య చిత్సున్న మిదే!

]-[ పటికార సున్నము ]-[

కం॥ హారతి కర్పూరము పటి
కారము మ్రుత్తి కమిశ్రయుప్పు ఘన వీరము పూ
నీరును జయనీరముతో
నూరియు పుడ మిడఁగ వలయు నుసి నుగ్గులలోన్

కం॥ చూచిన సున్నమునై యట
గోచరమగు దీనివలన గొప్ప పనులు వి
ద్యా చతురత ననుభవమున
వేచియు సాధింప వచ్చు విజ్ఞాన ధనుల్

[ నాగ సున్నము ]

కం॥ వీరము రసమును నాగము
నారతి కప్పురము తురుశి నయ సున్నంబున్
సారముగల పెట్లుప్పును
కారపు జయ నీరుతో నొకట నూరవలెన్

తే॥ బిల్లగాఁ జేసి యెండలోఁ బెట్టి తీసి
పెంకులో నుంచి చీలిచ్చి పిడక పుటము
వేయగా నాగ సున్నంబు వేడ్కఁ గాంచు
కుధర ధరభీమ దివ్య వైకుంఠ ధామ!

-( తెల్ల వంగ సున్నము )-

కం॥ పారదము తురుశు తగరము
నారతి కప్పురము వీరమాపెట్లుప్పున్
కారవు జయ నీరముతో
సారము దూలంగ మెదిచి సరసత దానిన్

తే॥ పెద్ద బిళ్ళ యొనర్చుచు బిగువుగాను
యెండ నెండించి ప్రమిదల నుండ జేసి
చీల లిడి పుట మిడ నది మేలిమిగను
సున్నమై యుండు వేదాంగ సూత్ర మిదియె

కం॥ ఈ తగర సున్న విధమును
యే తరగతి వారలైన నెఱుఁగరు తొలుతన్
ఖ్యాతిగఁ దెలిపితినని ముని
ధాత మహాద్రవిడ సూత్ర తతిలోఁ దెలిపెన్

-[- నల్ల సీస సున్నము -]-

కం॥ పారదము నల్ల సీసము
హారతి కప్పురము వీరమాతురిశు సురా
కారము జయ నీరంబున
నూరుచు నొక బిళ్ళ చేసి నుతమతి యగుచున్

ఆ॥ ఎండఁబెట్టి మూసనిడి చీల మరించి
శుద్ధిగాఁ బుటమిడ సున్నమగును
చొక్క రసము సీస సున్నానఁబడి చచ్చు
వేయు నేలకొ! గురుపీఠ మిదియె

-[- రజత సున్నము -]-

కం॥ హారతి కర్పూరము స
ర్వీరము పెట్లుప్పు మంచి వెండి పొడి మహా
పారదము నల్ల సీసము
సారతురుశు సున్నము జయ జలమిడి మెదపన్

ఆ॥ బిళ్ళఁ జేసి యెండబెట్టి పంతెలఁ జేర్చి
చీలలిచ్చి పుటము మేలిమిగను
బెట్టిరేని కాంతి వెలిఁగి యా రజితము
సున్నమగును సిద్ధులన్ని యొసఁగు

[-] అయ సున్నము [-]

ఉ॥ వంగము నాగమున్ రసము బ్రద్దలుగాఁ బొడిచేసి ముష
న్నంగడు జ్యోతి కప్పురము నవ్యపు వీరము తుర్శు సు
న్మంగల రాబొడిన్ మఱియునుం సననిమ్మ రసంబుచే
సంగత మాజయాంబువున సర్వము నూరయు బిళ్ళఁ గ

కం॥ బిళ్ళను యెండించుచు మూ
కుళ్ళను బంధించి చీలఁ గూర్చుచుఁ బుటమున్
మెల్లగవైచిన నాయయ
మెల్లను సున్నంబు నగును యిది సిద్ధులిడున్

-()- కాంత సున్నము -()-

సీ॥ సూదంటు ఱాళ్లను సొగసైన యినుమును
యివి రెండు పొడిచేసి యింపు మీఱ
హారతి కర్పూర మా సురాకారంబు
తురశు సున్నము వీర మురుతర జయ
నీరమందున జేర్చి నిగ్గుగ కల్వాన
మైనమువలె నూరి మఱియు దాని
పంతెలందుంచుచు భద్రత చీలిడి
సూటిగా పుటమిడ సున్నమగును

తే॥ కాంత మీ సున్నమున నగు కాయసిద్ధి
తెవులు మొదలంటఁదెగు వజ్ర దేహ మగును
భస్మములు సున్నములు ననుపాన తతులఁ
గొనిన శోభక్షయాదులు గూలు నీశ

][ సువర్ణ సున్నము ][

సీ॥ రస వంగములు రెండు పొసగించి కరిగించి
సమము బంగారంబు సరిగ తూచి
వెస కల్వమున వైచి మిసిమిఁ దేలగ నూరి
హారతి కర్పూర మమల తురుశు
సవ్వీరమును సురాక్షారంబు నందుంచి
జయ నీరమిడి లెస్స సరస మెదిచి
సననిమ్మ పండ్ల రసంబున మైనము
వలె దీర్చి చక్రంబు పగిది చేసి

తే॥ యెండ నెండించి ప్రమిద లింపెసఁగఁ గూర్చి
చీల మన్నుమ రించుచు వాలుకమున
లఘు పుటంబిడి తీసి కల్వమున వైచి
సరస జయ నీరు నిమ్మరసంబుఁ బోసి

కం॥ నూరుచు బిళ్లను జేయుచు
సూరాంశువు స్రుక్కఁ జేసి శుభ్రపు పంతెన్
గూరిచి చీలిడి పుటమిడ
సారపు సున్నంబగున్ ప్రశస్తత శౌరీ

తే॥ పసిఁడి సున్నము వలన దేవతలు మునులు
పనులు సాధించి కడతేరి రనుచుఁ దొల్లి
మీననాధుండు విజ్ఞాన మానవులకుఁ
దెలియ నుపదేశ మొసఁగె నో దేవ దేవ॥

-[ పూనీరు సున్నము ]-

సీ॥ కొంగ్రొత్త పూనీరుఁ గొని పది ఫలములు
శ్రేష్ట కల్వంబున దుష్టపాకు
పిండు రసంబున రెండుఝాములు నూరి
బిళ్లఁజేసియు నెండఁబెట్టి పంతె
లందిడి యైదు చీలలమర్చి వింశతి
పిడకల పుటమిడి కడకుఁ దీసి
మందుఁ గల్వంబున మర్ధించి యర్ధవ
రాయెత్తు కొచ్చి వీరంబుఁ గల్పి
దుష్టపాకు రసాన నిష్టతోఁ గడునూరి
మునుపటి క్రమమున పుటము వైచి

తే॥ ఈ ప్రకారమ్ము మందు నైదేసి మార్లు
పుట మిడినఁ దటి నారవ పుటవిధి విను
మందు శ్వేతార్క దుగ్ధములందు మెదిచి
నుగ్గు లైదింట బుటఁమిడ నిగ్గు గలుగు

కం॥ ఈ పూనీరపు సున్నము
దీపింపగ కందిబేడ దీటుగ తేనెన్
ప్రాపింపఁగలిపి తినినను
గోపపు శూలలును రొమ్ము కుట్టులు మానున్

కం॥ అల్లపు రసమున దేనెయు
మెల్లగఁ గలగల్పి మందు మిర్యపు గింజె
త్తుల్లము రంజిలఁ గ్రోలిన
గుల్లలు పిత్త కఫవాత కుటిలము లడఁగున్

కం॥ ఇచ్చా పథ్యముఁ బెట్టుచు
విచ్చలవిడి మందు రోగ వితతులఁ గనుచున్
హెచ్చౌ ననుపానంబుల
నిచ్చిన సకల రుజలడఁగు నిభరాట్పోషా

-[ పాషాణములు పాకమొనర్చెడి విధానము ]-

తే॥ అవధరింపుము దేవ పాషాణ యోగ
పాక సమ్మిశ్రమములు చిద్వస్త్రబంధ
నాదులు విశేషములు వైద్య వాదకులకు
దివ్య నమ్ముని మతమునఁ దేటపరతు

-[- గౌరి పాషాణ వప్పు -]-

తే॥ నాగరంబును పెట్లుప్పు నవ్యరసము
తాళకము పొడియొనరించి మేళనముగ
పందినేయిడి మర్ధించి పదునెరింగి
కోడిగుడ్డు పచ్చటి కర్వుఁ గూర్చి మెదిచి

ఆ॥ దుత్తలోనఁబెట్టి తోడనే చీలిచ్చి
పొయ్యిమీద నునిచి పొదుపుగాను
వండిరేని గౌరి పాషాణ వప్పగు
కనకచేల గోపికావిలోల!

-]- సర్వీర పాషాణ వప్పు -[-

సీ॥ కల్లుప్పు వర సురాకారంబు నిందుప్పు
వరనవాక్షారంబు పటిక మైల
తుత్థంబు సమపాళ్లు మొత్తంబు తులఁదూచి
యన్నింటి సమముగ నమల రసము
జేర్చి యొక్కటిగాగఁ జెలిమి చూరును జేసి
కాచకుప్పెకు వెల్తిగాను బోసి
వాయిరంధ్రము మూసి భద్రత చీలిచ్చి
కుండలో నిసుకను గూర్చి యందుఁ

ఆ॥ గుప్పె నునిచి ఝాము కుదురుగా వండి యా
మందు తీసి కరువు నందుఁ గూర్చి
యమల పారయుప్పు నన్న భేదియు పొడి
చేసి కలిపి కుప్పెఁ జేర్చి మరియు

తే॥ ఆరు ఝాములు వండిన నాది వీర
మవును కొంకణుఁడీరీతి యతులకెలమి
సరస నెరిగించె వీరపాషాణ మనఁగ
పరమ యతిరాజ! కోట్యర్క భాను తేజ!

-[- లింగ పాషాణవప్పు -]-

చ॥ సరియగుపాళ్ల గంధక రసంబులు మెత్తగ నూరి యందులో
గురువును జేర్చి యాగురువు కుండిన తూకములో సగంబు పా
ల్వర పటికారమున్ గలిపి బాగుగ చూరును జేసి కుప్పెఁ జే
కుర నొకఝాము వాలుకను గూర్చుచు వండిన జ్యోతివోలె సుం
దరముగ గట్టియుండు నిది తథ్యము లింగశిలాఖ్య నొప్పెడున్

-[- దొడ్డి పాషాణ వప్పు -]-

ఉ॥ పారదమైలతుత్థములు బాగగు సీసము నాగమున్నవా
క్షారము కల్వనన్నిధిని గల్పి మధించుచుఁ గుప్పెఁ బెట్టి శ్రం
గారపుటిస్కయంత్రమున గాఢముగా బరిపక్వమింపు జే
కూరగ వండిరేని యటగోచరమౌ లవణాఖ్య దొడ్డియున్

-[- చెప్పుతొట్టి పాషాణ వప్పు ]-[

చ॥ తలఁపగ నాగమున్ రసము తాళము వంగము హింగుళంబుసున్
గలయగ నూరి మూసనిడి గాఢపు ప్రొయ్యిడి మంటఁబెట్టుచున్
దెలివిడి వంట పాకమునఁ ద్రెళ్ళ గఁగన్గాని క్రింద దించి శీ
తలముగఁ జేసి చూడ ఘనతన్ లవణాఖ్యను చెప్పు తొట్టియౌ

-]- అయతొట్టి పాషాణ వప్పు -[-

చ॥ ఘనరస వంగ సత్తులును గంధక తాళక మింగి లీకముల్
గొనకొని చూరుజేసి కడుగొప్పగు కుప్పెకు నించి ప్రొయ్యిపై
నను నిగుడించి వండిన నయమ్ముగ ద్రవ్యములన్ని యేకమై
ఘనశిలవోలె కట్టికనగా నయతొట్టి యగున్ రమాధిపా

-)- పుల్తొట్టి పాషాణ వప్పు -(-

కం॥ వీకన్ దెలిసీసమ్ము సు
రేకారము నాగతాళ మింగ్లీకంబుల్
జోకగ నూరియు కుప్పెకు
పోకడ నిడి వండిరేని పుల్తొట్టియగున్

-[- రక్తశింగి పాషాణవప్పు -]-

ఉ॥ తాలిమి తొత్తుటంకణము తాళక గంధక మింగిలీకముల్
మేలిమి లెస్సగా మెదిచి మెత్తటి తామ్రపు బుడ్డి కెత్తుచున్
వాలుకయందు బూడ్చి యటవండిన ద్రవ్యములన్ని యేకమై
శ్రీలందెమల్చుచుండు నిధి సిద్ధసమాఖ్యను రక్తశింగియౌ

[-] హేమశింగి పాషాణవప్పు [-]

ఉ॥ గంధక పత్రతాళ భుజగమ్ములు తుత్థము హింగుళంబులున్
బొందిక నూరి పిడ్తనిడి పూపెర మంటిన చీలలిచ్చి యిం
పొందగ మంటగుర్తెరింగి ప్రొయ్యిడి వండిన మందుగట్టి యం
దందు వెలుంగుచుండు నిధియాలవణాఖ్యను హేమశింగియౌ

-[- రజిత శింగి పాషాణ వప్పు -]-

ఉ॥ వీరము తొత్తు శ్వేతశిల వేడ్క మణిశ్శిల తాళకంబు పూ
నీరు ముదారుశింగు గమనించుచు నూరుచు కంచు పాత్రలోఁ
గూరిచి చీలలిచ్చి కనిగొప్పగ వండిన నన్ని యేకమై
శ్రీరుచిమీర నారజితశింగి యనంబడు శ్రీరమాధిపా

-(- మురివిలా పాషాణ వప్పు -(-

ఉ॥ పిత్తళి పాత్రలో రసము వీరము మణ్శిల పత్ర తాళమున్
తుత్తము నాగంధకము సురభి ధూళియొనర్చుచు మూసకెత్తి తొ
మ్మొత్తు పుటంబుఁ బెట్టినను యెంచగ ద్రవ్యములన్ని యేకమై
హత్తుచు కాంతితో మురివిలా లవణాఖ్యము నొప్పు కేశవా!

(-) కార్మొగిల్ పాషాణ వప్పు (-)

ఉ॥ నాణెపుటింగిలీకమును నాగము వీరము తొత్తు శంఖ పా
షాణము పత్రతాళకము నన్నిట నూరి యయమ్మ డబ్బిలో
రాణ వహిల్ల చీలలిడి రంజిల నుగ్గులలోనఁ బెట్టి య
క్షీణతఁ గాల్చినన్ గఱగి చేకురు కారుమొగిల్ శిలాఖ్యమై

[-] పాషాణలింగ వప్పు [-]

కం॥ మణిశిల వంగము గంధక
మును వీరము తురుశు మెదిచి పొడి కుప్పెలలో
నునిచియు చీలిడి వాలుక
మున జాలై దింట వండ పూర్ణంబగుచున్

తే॥ హేమ వర్ణంబుతో నొప్పి మృదువుఁ గలిగి
చూచుటకు ముచ్చటై యుండు శుద్ధముగను
అదియు పాషాణ లింగ వప్పనఁగ దాని
నంగళుల విక్రయింతురు అబ్జనాథ

(-) శంఖ పాషాణ వప్పు -)

కం॥ వీరము పారదము సురా
కారము శ్వేతశిల తాళకము కల్వమునన్
గూరిచి పొడిగా నూరుచు
భారపు కుప్పెలకుఁ బోసి వాలుక లోనన్

కం॥ నాలుగు ఝూములు వండిన
మేలిమి ముత్యంబు బోలి మిక్కిలి కట్టున్
కైలాస వర్ణమై యిది
పాలన మొనరించు శంఖ పాషాణమనన్

-: గౌరి పాషాణ వప్పు :-

కం॥ తాళకము సత్తు తుత్థము
శిలపు వీరంబు శంఖు శిలయును పొడిగా
గీలించి కుప్పెఁ బోసియు
వాలుకమున నాల్గు జాలు వండిన పిదపన్

ఆ॥ సాంగ శీతలమున సడలించి చూచిన
పసిమి కాంతిమీఱి భద్రశక్తి
వంతమగుచు గౌరి పాషాణ మనబడు
సరస కడవకొలని చన్నరాయ

- వీరపాషాణ వప్పు -

సీ॥ శంఖ పాషాణంబు సారమణిశ్శిల
మైలతుత్థంబును తాళకంబు
గంధకం భింగిలీకము నవాక్షారంబు
పెట్లుప్పు టంకణం బెలమిఁ గూర్చి
సరియెత్తు పాదరసంబిడి కల్వాన
బొడిచేసి కుప్పెకు బోసి చీల
మన్నమరించి సమంచిత గతితోడ
నాలుగు ఝూములు వాలు కమున

తే॥ వండిరేనియు ద్రవ్యంబు బాగుమీఱ
కఱిగి గడ్డగా తెల్లగాఁ గట్టియుండు
అరువదియునాల్గు సరుకుల కాది గురువు
వీరపాషాణ వప్పున వెలయు నభవ

-:- కోడితలగెంది పాషాణ వప్పు -:-

తే॥ మైలతుత్థ మింగ్లీకంబు పాలతొత్తు
మణిశిలయు శ్వేతశిల నాగమమల పత్ర
తాళకము వీరమును వేశ్కాఁదనియు నూరి
కుప్పెకెక్కించి వాలుకఁగూర్చి మఱియు

కం॥ పాక మొనర్చిన ద్రవ్యము
లేకంబై కట్టిపోవు నెప్పుడు దీనిన్
ఆకోడ్తల గెంధి యనన్
దేకువఁ బిలిచెదరు జ్ఞానధిషణులు శౌరీ!

-: సౌరగంధి పాషాణ వప్పు :-

సీ॥ పారదంబును సత్తుపాల తుత్థము తాళ
కము తుర్కు వింగిలీకము మణిశిల
శ్వేత పాషాణంబు వీరంబు పూనీరు
తప్త కల్వంబునఁ దనియ నూరి
కాచకుప్పెకుఁ బోసి క్రమముగా వండిన
ద్రవ్యంబులన్నియు దనరగట్టి
కనకమయంబునై కనుపించు నదిపర
బ్రహ్మంబు నాఁబడు పరమ సత్తు

తే॥ వసుధ సౌరగంధి పాషాణ వప్పు యిద్ది
యోగవాహిని యగునంచు యోగివరులు
సిద్ధ వైద్యంబునను మెచ్చి సిద్ధు తెలమి
ననుభవంబున గుర్తించి రబ్జనాభ

[-] పగడపుట్ట పాషాణ వప్పు [-]

కం॥ పారదము నాగము నవా
క్షారము తాళకము గంధకము తుత్థము స
వ్వీరము మణిశిల హింగుళ
మారయ బొడిచేసి కుప్పె నందుంచి విధిన్

తే॥ వాలుకా యంత్రమందిడి నాలుగైదు
ఝాములును వండి మౌనివై స్వాంతసీమ
దేవదేవునిఁ జింతించి తీసి చూడ
పగడపుట్ట పాషాణ వప్పనఁగ వెలయు

[-] తార పాషాణ శింగి వప్పు [-]

కం॥ వీరము హింగుళము నవా
క్షారము శంఖశిల తాళకము మణిశిల వె
ల్గారము నాగము తురుశవు
పారదమును నూరి కుప్పె బంధించి తగన్

కం॥ వాలుకలో నుంచుచు విధి
నాలుగు ఝాములును వండి నాగాభరణున్
మేలిమిగ మీన నాథునిఁ
దాలిమి భజియించి తీసి దాచగ వలయున్

కం॥ ఇది తారశిల యనంబడు
ప్రథితంబుగ మీననాథుఁ బ్రార్థించి క్రియా
పథమున నుపయోగించిన
మధుసూధన! ఫలముఁ గలదు మహి వైద్యులకున్

[-] కోడాసురి పాషాణము [-]

సీ॥ శంఖపాషాణంబు సవ్వీరమును గంధ
కము తురుశువు తాళకంబు రసము
మంచి యింగ్లీకంబు మణిశిల నాగంబు
తప్త కల్వంబునఁ దాల్మి మెదిచి
తామ్రపు కుప్పెలో దనరంగఁ బొడిబోసి
షడ్జాము లిసుకలో సరస వండి
సాంగశీతలమున సమ్మతంబుగ దీసి
చూచిన నరుణమై సొగసు మీఱి

తే॥ వైద్యవాదము లన్నింటి పద్ధతులకు
గురువుగా నుండు భిషకులు మఱువ వలదు
అక్కోడాసురి పాషాణ మనగఁ నొప్పు
పరమ సుచరిత్ర రిపు జైత్ర పద్మనేత్ర

(-) పంచ పక్షి పాషాణ వర్ణం (-)

సీ॥ అప్పు నాదంబన నప్పురసంబగు
భూమి నాదంబన భూరసమగు
దేవవేద్యంబైన దివ్య మహారస
సద్గురురాయడై జగతి వెలయు
తురుశువు మణిశిల దొడ్డ సవ్వీరంబు
శ్వేత పాషాణంబు ఖ్యాతిఁ దనరు
లింగంబు నీ యైదు సంగతంబుగ నూరి
కుప్పెఁ బోయుచు మూసి కుతిక దాక

తే॥ చీలలేడును బంధించి వాలుకమున
నారు ఝాములు వండిన నమల మగుచు
పంచ పక్షి పాషాణాఖ్యఁ బరగు నిదియు
దివ్య రుద్రాగ్నివలె నొప్పి తేజరిల్లు

[-] కుంకుమ పాషాణ వప్పు [-]

తే॥ గంధకము మణిశిల తాళకంబు తురుశు
నల్ల సీసంబు తుత్థంబు నాగమమల
శంఖు పీరంబు నానవ్యాక్షార మింగి
లీకమును జయ నీరుతో జోకఁ దడిపి
నూరి పొడిచేసి కుప్పెకు కూరి మఱియు

తే॥ వాలుకా యంత్రమందుంచి పంచ ఝాము
లగ్నిపై వండ పసుపు వర్ణంబుఁ గలిగి
వసుధ కుంకుమ పాషాణ వప్ప నంగ
వాదముల కొప్పియుండును పరమ పురుష

:- రక్త పాషాణ వప్పు :-

కం॥ లింగము మణిశిల నాగము
శింగియు సూతంబు శ్వేతశిల పీరము జో
కం గంధకమును తురుశువు
సంగతముగ సమముఁ గూర్చి జయ నీరమునన్

ఆ॥ మెదిచి యినుప కుప్పెఁ బధిలంబుగా బోసి
చీలమన్నులిచ్చి సిద్ధపరచి
గొప్ప భాండమందుఁ గొమరొప్ప నిడివండ
కరిగి కట్టు చల్లబరచి మఱియు

కం॥ రెండవ దినమున గుప్పెను
జండికఁ బ్రార్థించి పగులఁ బదియగ లోనన్
పండిన దొండ ఫలాకృతి
నుండును రక్తశిల యనఁగ నుర్విఁ జెలంగున్

(-) గోముఖ పాషాణ వప్పు (-)

కం॥ నీలము శంఖు మనశ్శిల
తాళక మింగ్లికము పారదము గంధకమున్
మేలిమి నాగము వీరము
లాలితముగ నూరి రాగి డబ్బి నిడంగన్

కం॥ చీలలు జుట్టుచు బాగుగ
వాలుకలో వండి డబ్బి ఖంగింప నదే!
మేలిమి గోముఖ శిలయగు
పాలాక్షునిఁ దలఁచి దాచవలయున్ శ్రీశా!

(-) తురుశు పాషాణ వప్పు (-)

కం॥ గౌరివళం దింగ్లీకము
పారదమును తొత్తు శంఖ పాషాణంబున్
వీరము నాగము తాళక
మా రీతిని తామ్రకలశ మందిడి విధిగన్

కం॥ వాలుకలో నలు ఝామలు
మేలిమి పాకంబొనర్ప మేళన మగుచున్
లీల తురిశు వర్ణంబై
గాలును యిది తురుశు శిల నిరంజన మూర్తీ

[-] తుత్థ పాషాణ వప్పు [-]

తే॥ శ్వేతశిల తాళకము మణిశిల రసంబు
తురుశు వింగిలీకము పాలతుత్థ మమల
వీరశిల గంధకంబును వేడ్క మెదిచి
చూరు గావించి యంతయు శుద్ధముగను

ఆ॥ సత్తు కుప్పె బోసి సవరించి చీలిచ్చి
రాగి చట్టిలోన బాగుమీఱ
నునిచి నాల్గు ఝాము లెనయగ వండిన
మందు కుప్పె యేక మగుచు కరుగు

కం॥ ఇది గురువు లోహ సిద్ధికి
మధుసూధన! యెఱుకయున్న మహనీయులకున్
ప్రథిత మహా విద్యా సం
పద సిద్ధుల నొసఁగు తుత్త పాషాణ మిదే!

(-) రజిత పాషాణ వప్పు (-)

కం॥ సారమణిశ్శిల నీలము
పారదమును వీర శంఖ పాషాణంబున్
మీఱిన తాళకశిల వెలి
గారము తురుశువును లెస్సగా నూరి తగన్

ఆ॥ వెండికుప్పెఁ జేర్చి పండెండు ఝాములు
నినుప కుండలోన నిసుక కుమ్మి
వండిరేని రజిత వస్తువు లేకమై
రజితశిల యనంగ రాణ నెగడు

-[ సూత పాషాణ వప్పు ]-

తే॥ గంధకము మణిశిల తాళకము రసంబు
శంఖ సవ్వీరనామ పాషాణములును
హింగుళము మైలతుత్థమీ యెనిమిదియును
కూర్చి మర్ధించి సీసపు కుప్పెఁ జేర్చి

తే॥ వాలుకా యంత్ర మందుంచి పదియు రెండు
ఝాములును వండ నల్ల సీసంబు ద్రవ్య
చయము కరిగి యేకంబగు సరసత నిది
సూత పాషాణ మననొప్పి ఖ్యాతిఁ గాంచె

కం॥ సూతశిలవల్ల సిద్ధులు
నూతన వేధలును బుద్ధి నూహలఁ బెక్కొ
రీతులఁ గలిగించును ముని
ధాతల కిది పరుశువేధి తామర సాక్షా!

-[ నీలి పాషాణ వప్పు ]-

ఉ॥ నాగము పత్రతాళము మనశ్శిల గంధక పార దంబులున్
బాగుగ నూరి సమ్మతిడి భద్రతఁ బెద్దది కాచకుప్పెలో
వేగమ మూడు ఝామములు వేడుక వాలుకలోన వండ నీ
లాగరు కాంతి నీల శిలయై కరిగించుచు లోహ జాతులన్

[-] కాకపాషాణ వప్పు [-]

ఉ॥ సూతము వీర శంఖములు చొక్కపు నాగము తొత్తు తాళముల్
ఖ్యాతిని యిన్పకుప్పెనిడి యానలు ఝాములు వండఁ గట్టెడున్
శీతలమైన పిమ్మటను జేకొనుడద్దిర కాక నామమున్
బ్రాతిగఁ బల్కినారు వివరంబుగ దీనిని శ్రీరమాధిపా!

-: కరుణ పాషాణము :- [స్వర్ణ పాషాణ మనిపేరు]

చ॥ మణిశిల లింగమున్ రసము మంచిస వీరము తాళకమ్ము టం
కణమును పత్రతాళకము కల్వములోఁ బొడిచేసి స్వర్ణ కు
ప్పెనఁ బడబోసి చీలలిడి వేడుక వాలుకయందు వండ రెం
డును యొకతూరి యేకమయి లోహము లన్నిటు మండఁజేయదే

కం॥ వరమణివలె వెలుగొందుచు
సరసత లోహతతిఁ గల్మషంబుల నడఁచున్
గురుతరముగ నీ కర్పూర
కరుణపు పాషాణ వప్పు క్ష్మాస్థలి వెలయున్

[-] గంధక పాషాణ వప్పు [-]

తే॥ పాలతుత్థము మణిశిల మైలతొత్తు
గంధకము నాగ మింగిలీకంబు రసము
వీరశిల శంఖశిల మేల్మి చూరు చేసి
తామ్రకుప్పెకు బోసి భద్రముగ గూర్చి

కం॥ బాలాంబనుస్తవ మొనరిచి
వాలుక షడ్గాము లెనయ వండిన ద్రవ్యం
బాలీలఁగట్టి గంధక
మేళన శిలనామ మొప్పు-మేదిని వెలయున్

[-] లవణ పాషాణ వప్పు [-]

ఉ॥ వీరము పూరమున్ రసము పెల్లెడి యుప్పును టంకమున్నవా
క్షారము నింగిలీకమును సారమనశ్శిల నూరికుప్పెః జే
కూరిచి చీలలిచ్చి మ్లుఁగున్ గల చోటున మూడుఝూము లిం
పారగ వండ వాదములకద్ది మహాలవణాఖ్య మొప్పెడిన్

-( నాగ పాషాణ వప్పు )-

చ॥ నయమగు పారదంబసిత నాగము పెల్లెడి యుప్పు తుర్ను నఁ
దియమును లేని టంకణము దిట్టగు తాళక మింగిలీకముల్
ప్రియముగ నూరి పిడ్తనిడి పెద్దగ చీలిడి మారు సుగ్గులన్
మయముగ గప్పి కాల్చినను మందగు నాగశిలాఖ్య మొప్పుచున్

కం॥ సీసమువలె నుండుమ గురు
వై సప్తక లోహజాతి కాద్యంబగుచున్
భాసిలి నాగ శిలాఖ్యన్
వాసింగనెనిద్ది వైద్యవాదము లందున్.

(-) పటికార వప్పు (-)

సీ॥ భాండంబునను నిమ్మపండ్లరసంబును
పులిసిన పెఱుగును పూర్తినింపి
పూనీరు కల్లుప్పు పులుసు నిమ్మరసాన
నూరి యద్దానిలో మీఱగలిపి
భద్రిత చీలిచ్చి పాకము పదునుగా
నావిరెగురవండి యవనిలోన
నొకమండలముదాక నొకపరి బూడ్చిన
గాంతిమీఱిన పటికారమగును.

తే॥ పటిక లేనట్టి వాదమ్ము పనికిరాదు
పుడమి పొగపోవు ద్రవ్యాలఁ బొంది కట్టు
కట్టుగట్టిన ద్రవ్యాల గలదు ఫలము
భక్తజనకోటి మందార పరమ పురుష

- -వెలిగార వప్పు -

సీ॥ ఉద్దులుపటిక కల్లుప్పు పూనీరుప్పు
గురిగింజ పప్పు చేకూర్చి మెదిచి
కోడిగుడ్లను జీల్చికొనినట్టి తెలికర్వు
పోసి పిసికి భాండమునను బెట్టి
చక్కని క్షీరంబు సరసతఁ గలకల్పి
మూసి చీల బిగించి ప్రొయ్యిపైన
నావిరెగురదాక ననలంబునను వండి
యొక మండలము నల్లె యుంచిరేని

తే॥ పొంకమైనట్టి తెల్లని టంకణంబు
స్ఫటికముల లాగు మెఱయుచు వసుధ వెలయు
కఠిన లోహచయమ్ము నీరుగాఁ గఱంగు
వెలియుగారంబు సోకిన జలజనాభ!

[-] పూరం వప్పు [-]

తే॥ ఆ సురాకారమును పట్కి నరటిగడ్డ
సారమున నూరి కుండలో సరస నునిచి
చీల లిచ్చి యావిరెగుర లీల వండి
మండలంబిల పాతిన ఖండితముగ
మంచి కర్పూర మగును రమాధి నాథ!

-[- హారతి కర్పూర వప్పు -[-

సీ॥ వెడియుప్పు పూనీరు వెలిగారమును పట్కి
యివి యన్ని సమపాళలెన్నఁ గూర్చి
చందన చక్క కషాయంబు నందిడి
యంబిలివలె. గల్పి యమలమైన
భాండంబులోఁ జేర్చి పదిలంబుగా చల్వ
మిరియాలు పొడికల్పి మిక్కుటముగ
వాతను జీలిచ్చి వసుధలో నొక మండ
ల దినమ్ములును బూడ్చి పదిల పరచి

తే॥ తీసి చూసిన ధవళ కాంతిని జెలంగి
ద్రవ్యములలోన భార్గవ రాయఁడనఁగ
ఘనత గాంచిన హారతి కప్పురంబు
నొదవి యలరారు భూస్థలి యబ్జనాథ!

-[ సాంబ్రాణి వప్పు ]-

కం॥ లక్క లవంగపు చక్కయు
చక్కని గుగ్గిలము మెదిచి చట్టినిడి ఘృతం
బొక్కటి కలుపుచు వండిన
మిక్కిలి యిది కరుగు చాప మీదను బోయన్

కం॥ చల్లార్చ గడ్డ కట్టును
పెళ్లలుగా నుండు నిప్పు పెట్టినతోడన్
కొల్లలుగ పొగలు గ్రక్కును
సల్లలితపు పొగ చికిత్స సాంబ్రాణి యగున్

-) హారతి కర్పూర లవణ వప్పు (-

కం॥ కల్లుప్పు సురాకారము
పుల్లని పటికయును చవిటి పూతయు క్షారం
బుల్లసిత మరటి సొనతో
పెల్లుగ మర్ధించి కుండఁ బెట్టుచు వండన్

కం॥ నీరింకిపోయి కట్టుచు
పూర లవణనామమొంది మురహరు కెపుడున్
హారతిఁ బట్టను ప్రియమిం
పారదె! దీనార్తిహరణ పంకజనాభా!

-] గంధక లవణ వప్పు [-

కం॥ కల్లుప్పు నవాక్షారము
తెల్లని పెల్లుప్పు పటిక తిరుగంధకమున్
పిల్లల మూత్రము నందిడి
మెల్లగ వండినను నీర మింకిన పిదపన్

కం॥ గంధక లవణాఖ్యను జె
న్నొందియు సూతమును బంధ మొనరించును బెం
పొందగ సిద్ధుల నిచ్చును
సందేహంబేల? వెండి స్వర్ణము గాదే!

)- ఇందుప్పు ( సైంధవ లవణ వప్పు )-

కం॥ భూరి నవాక్షారము పూ
నీరు సురాకార మమల నీరధి లవణం
బారయ పటికారము పొడి
నూరుచు ఖరమూత్రమందు నుం గూర్చి తగన్

తే॥ భాండ మందిడి వడిగాను వండి దించి
సరుకు లెత్తుకు సగమిడి చవిటి పూత
కలిపి వండిన నిందుప్పు గలుగు నిజము
సైంధవంబిది వ్యాధుల సమయఁ జేయు

() సరుకులు కట్టుటకు మైన మగుటకు మఱియొక జయ నీరు ()

కం॥ పూరంబు నవాక్షారము
సారపు పూనీరు తొత్తు సమపాళ్ళరువై
ఖారపు ఫలముల చొప్పున
వారక చూర్ణించి విజయ వారినిడి విధిన్

తే॥ నాల్గురుఘాములు నూరి పింగాణి నునిచి
నిశిని మంచున నిడిరేని నీరమగును
యందులో వీరమును వైచి యవలఁ బెట్టి
పార్వతీదేవిఁ గని మది ప్రస్తుతించి

కం॥ సరుకుల రసవర్గాదులఁ
జురికించిన మైనమగును శుద్ధులుఁ జేయున్
విరివిగ లోహపు చిలుమును
జరచర దహియించు నిట్టి జయ నీరమునన్

[] మహా జయ నీరు []

సీ॥ అల కోడిగుడ్ల పెంకులు నవ ఫలములు
మిడికాకి చిప్ప తొమ్మిదది ఫలములు
చూర్ణంబు గావించి శుద్ధైన దొక కుండఁ
జేరిచి శంఖ సవ్వీర శిలలు
మైలతుత్థము మంచిపాల తుత్థము పటి
కారము తాళము గంధకంబు
వెలిగార మాయన్న భేది హారతి కప్పు
రము నవాక్షారము రసము సూర్య
కారము నయతొట్టి కార్మొగిల్ పదిహేను
దినుసు లొకింటి కైదేసి ఫలము
లన్ని టఁదులఁదూచి సున్నటి కల్వానఁ
బొడి నూరి పైకుండఁ బోసి కలిపి
ముదురెండ నందుంచి మొద్దుకట్టెతొ రుద్ది
యింకింపఁ జేయుచు నింగలమున
పక్వపు పదునుగా పాకంబొనర్చిన
సున్నమై యుండు నీ సున్నమునను

తే॥ అ నవాక్షార పొడి కల్పి యనుదినంబు
తేల మంచున నుంచిన మేలి నీర
మగును యిది కడుంగారమై యలరి తాళ
కమ్ము తుత్థమ్ము లోహ వర్గమ్ము నెపుడు

కం॥ సత్తుగ గరిగించును జిగి
మెత్తని మైనమును జేయు మేదిని లోనన్
గ్రొత్తలు గావివి పూర్ణపు
చిత్తుల నాడించి యిది ప్రసిద్ధికి నెక్కెన్

[] రస కట్టు []

చ॥ అరపడి యుప్పు మధ్య రసమైదు ఫలంబులు బోసి కుండ యం
దరపడి యుప్పు పైన నిడి యందున వేఱొక కుండ మూసి సం
దరముగ చీలమర్చి మఱిద్వాదశ ఝాములు వండిరేని పా
దరసము తత్పతంగమగు దానిని వాలుక యంత్ర మందునన్

కం॥ నాలుగు ఝాములు వండిన
శీలముఁ జెడకుండ రసము శ్రేష్టతఁ గట్టున్
లీల రసవాద వైద్యులు
దాలిమి యోగములఁ గూర్చ మేలగు శ్రీశా

][ మూలికా రసకట్టు ][

కం॥ మేలి మునగ జల పిప్పలి
పాలాకులు కారమునగ పత్రరసాలన్
దాలిమి నొక ఫలరసమును
గేళిని మర్ధించి నారికేళము నందున్

కం॥ ఇడిమూసి చీల లిడి చా
ెడు పిడకల పుటముఁ బెట్టిరేనియు గట్టున్
కడు ముదమున నద్దానిని
విడి విడి యోగములఁ గూర్చ - విభవము గలుగున్

-[] లింగ కట్టు []-

తే॥ తామ్ర మొక ఫలంబును హరిదళము పంచ
ఫలము లొక పెంచు నందడి వహ్నులందుఁ
గాల్చగా వెట్టయగు దానిఁ గనక పత్ర
సాంబ రేణాకు రసముల సరస నూరి

కం॥ లింగమునఁ గవచ మిచ్చుచు
రంగెసఁగగ నారబెట్టి ప్రమిదెల లోనన్
సంగతిగా దుగపిడకల
నింగలమునఁ బుటము పెట్టనిట నదికట్టున్

కం॥ రస కర్పూరము లింగము
పస తాళక గంధకములు ఫలముల లెక్కన్
వెసఁ దూచి చూరు చేసియు
నసదుగ శ్వేతార్క దుగ్ధమందు మెదుపుచున్

కం॥ జోకగ నొక ఫల తామ్రపు
రేకునఁ బట్టించి మూరలెత్తున పిడకల్
దాకగ పుటమిడి దానిని
నా కల్వములోన నూరి యర్కపు పాలన్

ఆ॥ మెదిచి బిళ్ళగట్టి మేలైన సాంబ్రాణి
యాకు కవచ మిచ్చి యైదు పళ్ళ
నుముక మందు పుటముఁ గ్రమముగా వైచినఁ
గట్టు లింగ మపుడె కమల నాథ!

-[ శ్వేతవర్ణ హింగుళ బద్ధ క్రమము ]-

కం॥ కప్పురము గుగ్గిలంబును
వప్పగు సాంబ్రాణి తులము వంతున సమపా
ళ్లొప్పగఁ గొని పొడి చేసియు
మెప్పుగ తులమెత్తు దరద మింపుగఁ గొనుచున్

కం॥ దీపాగ్నిపైనఁ బెట్టుచు
నే పారగ మందు చూర్ణమిడి వేయించన్
గా పదపడి నా ద్రవ్యము
నా పటికముఁ బోలి శ్వేతమై యలరారున్

కం॥ ఈ హింగుళ బద్ధము శు
ద్ధాహారముతోడఁ గొనిన తక్షణ మాత్రన్
మేహ వ్రణ వాయువు జ్వర
మూహింపగ మాను నిజము ఉర్వీ రమణా

-) నవాక్షార కట్టు (-

తే॥ ఎఱ్ఱ నల్లేరు కుండ కింపెసఁగ బెట్టి
మధ్యలో నవాక్షారంబు మాటి మూసి
చీల లమరించి మూరెడు దాలి నునిచి
పుటముఁ బెట్టిన నదికట్టు పూసలాగు

తే॥ ఎద్దెముక చూర్ణమును పదిహేను తులము
లెనయఁ గొనితెచ్చి దుత్తలో నునిచి మధ్య
నానవాక్షారమును బూడ్చి పైనముగను
మూసి చీలిచ్చి కుక్కుట పుటముఁబెట్ట
పూస లాగున నదికట్టి వాసిఁ గాంచు

-: వాద కర్మల కుపయోగపడు నవాక్షార కట్టు :-

సీ॥ అడవి యందున నెండినట్టి కొయ్య జముండు
కాల్చిన బూడిద కొత్త దుత్త
కర్థ భాగము బోసి యందున కూటి యు
ప్పును నాల్గు ఫలములు బోసి దాని
పై సురాకారంబు వఱల రెండు ఫలాలు
దానిపై వెడియుప్పు బూని రెండు
ఫలము లందిడి దానిపై సీమ సున్నంబు
రెండు ఫలంబు లందుండ బరచి
చదునున నానవక్షారమొక్క ఫలంబు
కుదురుగా భద్రతఁ గూర్చి మఱియు
తరిసీమ సున్నంబు వరసురాకారంబు
వెడియుప్పు ద్రవ్యాలు వేడ్క రెండు
ఫలములు చొప్పున వారిధి లవణంబు
నాలుగు ఫలము లందందు చూచి

తే॥ క్రమముగాఁ జల్లి నాఘట కంఠసీమ
జముడు బూదియు పూరించి చట్టిపైన
మూత మూకుడు మూయుచు పూర్ణముగను
చీల లేడిచ్చి ప్రొయ్యిపైఁ జెలఁగ చేర్చి

తే॥ ఐదు గంటలు గడు కమలాగ్నిపైన
సరస వండిన నానవక్షార మెల్ల
గట్టియుండును యిది వాద కర్మలందు
ముఖ్యమై యుండు నెఱిఁగిన బుధుల కెపుడు

:-[ రస కర్పూర కట్టు ]:-

సీ॥ చనుబాల శుద్ధి చేసిన రస కర్పూర
మొకఫలంబుండెడి యొకఁట గడ్డ
చానికపైఁ బెట్టి సరస దీపాగ్నితో
తెల్లగడ్డల నూనెవల్ల నాల్గు
ఝాములుఁ జురికించి చయ్యన వేఱొక్క
చట్టిపైఁ బెట్టుచు సత్త్వమగుట
కాసురాకారంబు నైదు ఫలంబులు
క్రింద పైనను జల్లి పొందు పరచి

ఆ॥ ఐదు కోడిగుడ్డు లందున్న యంబిలి
పైన బోసిఁ పొయ్యిపైనఁ బెట్టి
పాక మెరిఁగి యనుభవంబుగ వండిన
కరువు మహిమ వలన సరుకుఁ గట్టు

కం॥ దానినిఁ గైకొని వేరొక
చానికలో నునిచి దొండ శ్యామల వర్ణం
బైన తులసి రసములతో
వైనంబుగను జురికించి వస్తువు గొనుచున్

కం॥ ఈ రసకర్పూరముపైఁ
జేరిన గల్మషముఁ దుడిచి చేకొని దానిన్
మీఱ పెసర గింజంతయు
శ్రీరుచి తేనియను గూర్చి సేవించినచో

తే॥ వాత కఫ దోష రోగ సర్వవిష మాది
శ్వాసకాశలు మూర్ఛలు సమసిపోవు
స్తన్యమునఁ గొన్న సన్నిపాతములు మాను
భద్రరస కప్పురపు కట్టువలన శౌరి

తే॥ జగతి స్వచ్ఛంద భైరవి సన్నిపాత
భైరవౌషధములు మున్న హావిలాకు
ఉలిమిడియు చక్క రసముల నొకటి చేర్చి
పూర బద్ధంబు నటఁ గల్పి పుచ్చుకొనిన
సన్నిపాతాది జిహ్వా దోషములఁ బాయు

-: వెల్లుల్లి తైలక్రిమము :-

కం॥ వెల్లుల్లిపాయ లన్నియు
వెల్లగ పొట్టొలిచి యెండ వేడిమిలోనన్
చల్లిన నెండించిన చము
రెల్లను వడియంగ పిండి రేనియు వచ్చున్

-: ఇంగిలీకపు కట్టు :-

సీ॥ పెద్ద టెంకాయంత పెనుజీడి విత్తుల
ముద్ద మధ్యంబున మూడు తులము
లింగిలీకపు గడ్డ బంగారు వరహా యె
త్తగు రేకునం జుట్టి దాని కపుడె
పూనీరు సున్నంబు నానీరమునఁ గల్పి
యారంగ బట్టించి యందుఁ బొదిగి
పెద్ద చట్టిని బెట్టి పెనుమంటచే వండ
గా జీడి మండుచు కాలి భస్మ

తే॥ మగును దరద స్వర్ణము లేక మగుచు గఁజిగి
కట్టియుండును దానిని కడకుఁ దీసి
పెసర బేడంత తేనెలో మెసవిరేని
ధర త్రిదోషముల్ సన్నిపాతములు మాను

:- యజ్ఞ కర్మ ఫల ప్రభావము :-

సీ॥ ఏ మహర్షులు యజ్ఞమెయ్యది యైనను
వేడ్కఁ జేసెడి క్రమం బెట్టులనిన
నోషధీ తరులత భూషితాద్రి ప్రాంత
జీవనదీ వన సీమఁ జెలఁగు
హేమ వర్ణోపమ భూమిపై యజ్ఞంబు
నిలపతి ధనము వెచ్చించి ఋషులు
వేదోక్తవిధిఁ దీర్తురాధరపతి పేద
యై యుండు నా సమయమును దెలిసి

ఆ॥ మఱియు కుండమందు వరరస సిద్ధులు
ఆ రసాయ నౌషధాదుల నిడ
నా యరణ్య మక్షికాళియు బరతెంచి
యందు నండము లిడు నవియుఁ జిదిగి

కం॥ నాగములై జన్మించుచు
బాగుగ నటుఁదిరిగి కొన్ని వాసరములలో
భోగులునై నెగడొందును
యోగులుఁగని వాని పరశు పురగములనుచున్

కం॥ పరిపక్వ దశ నెఱుంగుచు
పరికించుచుఁ బట్టి ధృతి నపాయతగతి సుం
దరముగఁ దీయుదు రాత్రుతి,
బోర తామ్రపు రేకులద్ది పుటమిడ నదియున్

కం॥ మేలి పసిడిఁయగు నిజ భూ
పాలున కర్పించి ప్రజలఁ బాలింప మునుల్
లీల వినుతించుచు తప
శ్శీలతఁ బోవుదురు వన్య సీమలఁ జేరన్

కం॥ మును హరిహరు లీ పాముల
ననయము తల్పంబు భూషణావళి గాగన్
గొని ధరియించిరి బుద్ధుఁడు
తన కరమునఁ బట్టి తాల్చి ధన్యుండయ్యెన్

కం॥ ఇది పరుసవేధి కథనము
చదివి తదర్థంబుఁ దెలిసి శాస్త్రానుభవా
స్పదముగ నది సాధించిన
బుధ వైద్యులు నిహపరాలఁ బూజ్యులు గారే

కం॥ కుండమున కుంభమున నీ
ఖండమునన్ మనుజసృష్టి కనక పరుస ము
ద్దండమునులు సృష్టించిన
మెండగు చరితంబుఁ గలదు మేదిని శ్రీశా!

(-) ప్రాచీనులు కనుగొన్న ఉప్పు పులుసుల వివరము (-)

| | ఉప్పులు | | పులుసులు [అమ్లములు] |
|---|---|---|---|
| 1] | పాదరసము | - | తాళకము, గంధకము |
| 2] | పెట్లుప్పు | - | పటికారము |
| 3] | కర్పూరము | - | మైలతుత్థము |
| 4] | కల్లుప్పు | - | పాతచింతపండు |
| 5] | సముద్రపునురుగు | - | రాతిమదము |
| 6] | అన్నభేది | - | బంగారు |

| | | | |
|---|---|---|---|
| 7] | సర్వీరము | - | పులిచింతాకు |
| 8] | మాంసభేది | - | శిలామదము |
| 9] | అభ్రకము | - | గోంగూర (పిండికూర) |
| 10] | గౌరిపాషాణము | - | పుల్లమామిడి |
| 11] | తెల్లపాషాణము | - | తాటికల్లు |
| 12] | వైక్రాంతము | - | శోణితము |
| 13] | నవాక్షరము | - | వెలిగారము |
| 14] | కోడిగుడ్ల బొప్పులు | - | దానిమాంసము |
| 15] | కాకిచిప్పలు | - | దానిమాంసము |
| 16] | శంఖము [అబ్జము] | - | దానిమాంసము |
| 17] | పచ్చకర్పూరము | - | ఇందుప్పు |

సూత్రము:- ఉప్పులు పులుసులు సమమైన పాళ్లలోఁ గలిపి పుటము వైచిన లవణములగును "లవణేన సువర్ణం సంధ్యాత్" అని ఛాందోగ్యోపనిషత్తు నుడువు చున్నది.

| | నాదములు | | బిందువులు |
|---|---|---|---|
| 1] | కృష్ణాభ్రికము | - | సూతము |
| 2] | పూనీరు | - | కర్పూరము |
| 3] | విమలము | - | వెండి |
| 4] | త్రిగుణిశిల | - | సముద్రపు నురుగు |
| 5] | భూనాగము | - | సర్వీరము |
| 6] | ఇంగ్లీకము | - | జాతియుప్పు |
| 7] | ఇనుము | - | యవక్షారము |
| 8] | నాగవంగములు | - | పచ్చకర్పూరము |
| 9] | కాంతము | - | శిలామదము |

సూత్రము;- ఇంగిలీక మనెడి నాదమునందు రజిత లోహమను బిందువునుఁ గలిపిన కళలు జనించును.

తత్సత్.

## శ్రీసనారీ విశ్వేశ్వర సంవాదము (విశ్వనాథావధూత)

### -: వాదము :-

సీ॥ మేలిమి బంగారు మేరువు కుడిచెయ్యి
ఆయుధంబులు శస్త్ర మస్త్ర సమితి
అంగళ్ళలో నాణ్యమగ్రమై గనుపించి
నట్టి కైలాసంబు నాట పట్టు
ఈతన్వ సాధించి యెలుఁగువై రాగివై
యెండ నీడను పొట్టనిండ నింపి
యిచ్ఛా విహారమై యెందు లోపము లేక
పచ్ఛాకు మీగడ బ్రహ్మ పదవి

తే॥ పాలు భోగించి బ్రహ్మంబు బట్ట బయట
చూచి మేల్గాంచి కలతల సూటి వాని
వేషధారుల దిగనాడి వేద మూల
మయిన బ్రహ్మంబు నీవుగా మంత్రమూర్తి

కం॥ ములు మూడు దారులున్ గల
బలభూజ రసంబు పాలుపాధులు గావా!
అలవడి నానందంబగు
చెలియా! ధనమేల? వారిచే నుంచుటకున్

కం॥ మఱియున్ కొక్కు-శిలంబులు
సరిగా పొగపోక యున్న సమకూర్చునదే
సిరియోగంబులు జ్ఞానుల
తరమే! సంసారికేల తలఁపులు పత్నీ!

కం॥ మహినావ శంఖు సిద్ధికి
విహితము శిల్పమును గూర్చి విపినంబులలో
మహయోగులు భోగింతురు
మహిమలుఁ జూడంగ నోప మాటలు కావే

కం॥ సిద్ధుల కుపాధి మూలిక
లద్దములోఁ జూచినటుల నాత్మార్థముగా
బద్ధము లేకను తెల్పుము
సిద్ధగురుస్వామి! మిమ్ము సేవింతుగదా!

-: సిద్ధ బద్ధ మూలికా పంచకము :-

చ॥ వినుము! సుగంధ కందయును వీనుల విందుగ విస్మయంబగున్
తనువుల పోషణంబునకుతత్త్వవిధుల్ సమకూర్చియున్న యా
వనజము లష్టలోహముల స్వాకృతి సున్నము గాగ భస్మముల్
తనువుల రోగ హంతయని తథ్యముగా మది నమ్ము పార్వతీ

తే॥ ఇటుల నహినేత్ర కందయు నెఱుఁగ వలయు
మఱియును రుదంతి కందయు మంచిదౌను
క్రోధకందయు నాలాగు గుణము లిచ్చు
తైలకందను భూభుక్త తలఁపు దఖుగు

వ॥ వినుమో! పార్వతీ! ఈ చెప్పఁబడ్డ యైదు మూలికలు సిద్ధ పంచకంబనియు సిద్ధులకుఁ బోషణార్థంబైన యుపాధి వంశంబనియు లోకులకు నీ రహస్యంబు లేమియున్ జెప్పక అష్ట లోహంబులును అరువదియారు పాషాణంబులు, పాదరసంబు, మొదలుగా నన్నియు భస్మంబులగు అదియునుంగాక సమస్త రోగంబులు అవలీలగా నగ్నిచే సమస్త లోహంబులు భస్మంబు అవునట్టుల చేయుచుండుననియు సలోహ పాషాణంబులు, గురు భస్మంబులయి లోహాదుల రం ఎలు సంపూర్ణముగా భేదించి మనోహరంబు చాయం గలవిగా నుండు నని యెఱుంగుము. ఈ అయిదింటిలో నొక్కొక్కటియే యా చెప్పిన ప్రకారంబున నన్నికార్యంబులు చేయుచుండు రుదంతికందయనగా కూతురు బుడగయు పరియాయముగ నూగు దోసయు క్రోధకందయనగా పంది తివ్వ. తైలకంద యనగా వర్ర పొన్న గంటియని యెఱుంగుము.

తే॥ చెన్నచెర్లయు వూడుగా పొన్న తురక
వేపయును పుత్రజీవికారూపు పంది
పాలయును యరప్రి చిరతల పలగ వుక్కు-
రాగుడీ చెట్లకాయల నాగు రసము

కం॥ వాదము ఖేదము మోదము
కాదనకుడి భావమెఱ్ఱిఁగి కర్మఠులైతే
నాదమెఱింగి తిరస్కార
మాదరు వనుకొండు రెండు మహా విద్యలకున్

తే॥ మూడు భావంబు లిందు నే మూల నుండొ
గాని వెదకంగ రాద! శ్రీకాముకులకు
లోన నిక్షేపముంది ఆ లోక మేది
కలిగి యుండిన వారికే కలదు గలదు

-: తాళకము సవ్వీరము ఇంగిలీకము సింధూరములు :-

కం॥ నింబసుమా ఫలపత్ర ర
సంబును తాళకము దరద సావీరము లే
శంబును లోపము రాక పు
టంబును సింధురము సేయు నా కల్పారమ్

కం॥ కలుబందంతర్ధామర
వలన శిలాజితు కపిత్థ నవపాషాణం
బులు ధ్రుతిని రసము శుల్బము
యిల నిమ్మను అన్న భేది యొల్గుట నిజమౌ

కం॥ వంగముచే తాళకమును
లింగముచే యినుము నాగలీల సువర్ణమ్
బొంగు మణిశ్శిల సీసము
సంగము మాక్షీక రజిత సాధన మృతిసుం

వ॥ ఇందుకు పురుష రత్నము సహాయముగా నుండవలెను.

కం॥ పురుగుడు శీసము తగరము
శిరిసత్తువు దుష్ట చెట్టుచే తుత్థంబున్
అరిటాకు పల్లెరాకును
బొరిచేయును నిజము నమ్మ! పూర్ణము సుమ్మా

వ॥ పందికందచే నన్నియు పూర్ణంబుగ భస్మంబు లగునని
యెఱుంగవలె. షంధికంది యనంగ భూతాళము.

-: తామ్రి భస్మము :-

కం॥ అంతా యెఱుపగు దుచ్ఛన
మెంతా కొత్తిమిరి చిట్టి మేలు సువర్ణమ్
చింతింపఁ బోకు తామ్రము
వింతగ భస్మంబు లగును విధి సత్తు నిడన్

కం॥ వస యింత పిట్ట పాదము
పస తేలాగంధకంబు పాలుగ శుల్బమ్
నిసిలోను పుటము వేయుము
వసుసాధన భస్మయోగ పాటమిదేయౌ

-: యశదము తామ్రిము భస్మము :-

ఆ॥ చిట్టి యుత్తరేణిచే దుంప రాష్ట్రంబు
ముల్లుతోట సత్తు మూల మణఁగు
తెల్ల బోదతరము తెల్లవాకుడు రాగి
పిట్టకాలు రాగి పెద్ద పరుసం

-: గంధక తైలము :-

కం॥ వినుమా! నల్లని గంధక
మను తైలము ధాతు భేదములు సేయు మటిన్
ఘన కొక్కురాయి యటువలె
ననుమానము లేదు చూడు మారీతి యగున్

వ॥ ఇదియునుంగాక సిద్ధ పంచకాదులతో సమస్త కుష్టవ్యులును, రాజయక్ష్మలు, పాండువులు మొదలగు సమస్త రోగంబులు సర్వ విషంబులు హరించుటయేగాక సమస్త పాషాణంబులు, సమస్త లోహంబులు గురుభస్మంబు లగునని యెరుంగుము.

చ॥ వినుము! రుదంతి కందయగు విశ్వములో నరు జిహ్వ నాగలో
చనమను కంద వృశ్చిక విషంబు హరించు సుగంధకంద నా
ఘనతర క్రోధకందయును కాయును యీతను తైలకందయో
ననయము నైదు కందలను నైదు విధంబులు నాగు సూతమున్

వ॥ ఓ పార్వతీ! ఇదియే రుదంతి కంద; యీ భస్మమే షరమాయని మసానులు, అవధూతలు వాడుక సేతురు. ఈలాగుననే మైల తుత్థము తాళకము గోదంతి, కొక్కు పాషాణము, సవ్వీరములు, గురుభస్మంబు లగునని యెరుంగుము.

]- వంగ భస్మము -[

శా॥ నేపాళంబులు ముద్ద జీడి తునకల్ నిండారగా డబ్బునున్
దోపావంగము డబ్బిలోను యిడియున్ దోట్రోడ పుట్టంబులున్
గా పాగన్దగ జుట్టు శీశకు పయిన్ గాల్పించు మాపై నదిన్
లోపంబుండదు తేప చూడు తెలుపాలోకించుమా! భస్మముల్

]- పాషాణముల సున్నము -[

కం॥ తొమ్మిది యుప్పులు కవచము
లిమ్మా! పాషాణములకు వెనుకను సున్నం
కమ్మని పిడతను పుటమై
తెమ్మా! వంగములు రాగి తెగుపులు కావా!

-] కరణుల వివరము [-

వ॥ ఇదియునుంగాక గాడిద గడపర స్థానభేదంబు నెరింగి వయస్సు తెలిసికొనిన బలవన్మరణంబులగు వారలకు సంజీవికరణి యగు. ఇటుల ముర్లేవు వెదురులో నున్న నేరేడు బదినిక నటులఁ జేయంజాలు. మఱియు కసివంద స్థానభేదంబు వయిస్సును తెలిసికొనిన, విశల్యకరణి యగు. సత్తుపొత్తుయను నిద్దురగన్నెయు యట్టి ఉత్తరేణియు సాధన కరణియగు అటుల భ్రమల మఱ్ఱి సమ్మోహ కరణియగు అటుల యేదు పంది రోమము బొంగిలియు సంపాద కరణియగు మఱ్ఱిపాల (ఇఱ్ఱిపాల) ఈశ్వరి గొడ్డు కాకరయు విషఘ్నకరణియగు తెల్ల విత్తెమల్లి విభ్రమ కరణియగు. భూనాగ మదృశ్యకరణియగు, నిద్రగన్నె యావాహన కరణియగు, నల్లవావిలి అజరకరణియగు త్రిధారావ్వయము యింతాళము అరుణ చిత్రము, పిట్టపాదములు, సువర్ణకరణులగు. విద్య యశోకరణి యగు ధనము భోగకరణియగు యోగము మహత్కరణియగు దానము సంగ్రహకరణియగు అభిమానము చలనకరణియగు లౌభ్యము దుష్టకరణి యగు వివాహము సంతానకరణియగు, సంపత్తు కష్టకరణియగు, గురుసేవ మార్గకరణియగు జ్ఞానము మోక్షకరణియగునని యెరుంగుము.

కం॥ వంటింటను నట్టింటను
యింటను కంసాలవారి యింటను పెరటన్
మంటి పనివాని తోటను
వంటను బజారు వస్తువులు కనకమగున్

ఆ॥ రాజనెల్లియడుగు రామాయణంబేల
చూతమందుఁ గోరి చూడరాద
వాదమైన వెనుక వాదెందు కోసమో
వెండికొండ నిన్ను వేడుకొన్న

కం॥ రాజ యుసరికా మర్మము
భూజంబులు యోగసిద్ధి పురుషుల కొరకా
తేజంబు నూర నూరను
భోజనముకు వంటలెఱిఁగి పూర్ణులయేరా

తే॥ పెద్ద యేలిక చెవిబట్టి పిండి రసము
ముద్ద జేసిన వారికి ముక్తి భుక్తి
కొఱకు ధన స్వామ్యములను జూడ కోరికేలః
రాజులకు రాజు రారాజు రాజయోగి

కం॥ తలచిన మాత్రముఁ దెలియని
యిల యేలిక సూరు చర్య యింద్రత్వము దా
ఫలమేమున్నదో యడుగుము
తలపోయుము విశ్వనాథః తత్త్వ ప్రకాశా

కం॥ ఊకర్చు పెట్టబోకుము
రూకకు పది రూకలెత్తు రూపించునదే
ఆ కొక్కెకొంటఁ గన్ను గొఁను
శ్రీకాకుళ విశ్వనాథ! శ్రీవర్ధకజా

ఆ॥ పిల్లబుడగ రసము పెద్ద ఊలను జూడు
ధాతువులను పట్టిదారి నెఱుఁగు
రాచయుసరి రసము రారాజు సాదేవి
తెల్ల సీత రసము తెమ్ము వశము

వ॥ యేడి గురువు వాసన యందే వసించి యున్నాడు గురువుబ్రోగందా

ఆ॥ పనస రావి బొడ్డ ఘన మఱ్ఱి పాలను
కలుపు స్కాంత తాయి కలిశ లినుము
జలముఁ బోసి వండు సర్వ పాషాణముల్
ధాతు కులము రసము ధనము సుమ్మ

సీ॥ ఆయుధాలను బట్టి యగ్రగమై నిలువాని
కాయంబులో తలకాయ దొకటి
పిన్నవారలకెల్ల పిలుపు లానందింపు
చున్న రెండవది పసపొన్నెమూడు
వాలంబుచే పీడ వాటంబునౌ నాల్గు
కాయంబు చేయని ఘనము నైదు
ఆగ్నేయ మందున్న నా భూమి పతియారు
అన్నంబుఁ జేయించు నదియు నేడు

తే॥ నేరు పెరిఁగిన వారైతె నిజముగాను
కారణాచార్య వాదంబు కల్లగాదు
నమ్మ మోరీ ప్రపంచంబు నమ్మబోకు
విశ్వగురునాథ! సింహాద్రి విశ్వనాథ

వ॥ ఓ పార్వతీ! వసుంధరా మండలంబునందు సుందరంబై యుండు నది యెటులనిన దాకోపవాక్యంబును నీవవగాహనంబు చేయుమా యేడుగురు మాదిగల బట్టి కుత్తుక కోసిన తావుననే పచ్చబండ నున్నాడు గురువు కసాయి వాడా!

బుట్టమీద 1, తెట్టతెన్ను 2, బట్టబయట 3, గుట్టులేదు 4, పట్టుకొమ్మ 5కి, వెంట నుండు 6, నిండుకుండ 7, దడ్లుపొల్లు8, తన్నెరాశి 9, చూడుమో పార్వతీ! వంతుకు పదియారు వంతులు మొహరీలు నీ సహాయము గలుగు వారలకు సిద్ధింపుచుండునని తెలియుము.

-: కట్టుకు తగిన వస్తువులు :-

కం॥ కల్లులు నవరాలు 'కుజం'
వల్లను హరితాళ సరస వశ్యము శంఖం
బుల్లుప్పుకు సౌవీరము
ముల్లోకము సేయు పాదమూలము పత్నీ!

కం॥ అల్లా చిత్రము సూతము
నల్లని గంధకము రసము నరుమల సారం
వల్లను పచ్చని జాలగు
తెల్లని పూ వుత్తరేణి దివ్యంబు సుమా

-: మైలతుత్థ భస్మము -

కం॥ పెద్దీత తుత్థ కూటము
పెద్దమ్మను గొట్టు పంది బెదరింపకు మీ
వద్దను అద్దము చూచుకొ
యిద్ధర మా అవుట రాగి నెఱయోగము సుం

-: తాళకము ఇనుము భస్మము :-

కం॥ వినుమా! కానుగు రసమును
చినపేలుడు తెల్లచెట్టుచే తాళములున్
వన వెలి యాముద మినుమును
ధనమని తలపోయు మెపుడు తధ్యంబు సతీ

ఆ॥ కూరచేయు తమల కూరాకు రసమును
యిత్రిపాల సూత మింకి తంబు
గోమయంబు చింత గూడిన తాళంబు
వెలిగుళింద రసము విభ్రమంబె

-: కట్లు, భస్మములు :-

ఉ॥ కిట్టలి నాగజెమ్ముకును గిట్టును లింగము మొండి వుల్లుచే
కట్టు రసంబు హాను మిరియాల కగత్యము రాగి వంగమున్
పిట్ట సువర్ణ రౌప్యములు పిండిని జేయును లోహజాతులన్
తిట్టిన యట్లు చోద్యమిది దివ్య మదే! పరుసం రుదంతికమ్

ఆ॥ వేరు విష్ణు క్రాంత వెలిసిన క్రాంతయు
కలయకోటనాఖ్య క్రౌంత రాగి
పుట్టపౌదర వెండి బూడిద సీసమ్ము
తెలియ వంగమునకు చెరుచు చూడు

-: హాద కార్యముల కుపయోగించు చెట్లు :-

చ॥ పస కలియున్ కపిత్థఫల పచ్చన సున్నము నర్కాక్షీరమున్
రసము జరార్క పత్రములు రాక్షస నీరము రామభుక్తమున్
కసి సముదాయ పుష్పమును గంజరి మోదుగ శిగ్రు పుష్పమున్
నస గళసార తాళములు నార్యుల కేశ మయూర జూటమున్

తే॥ కోడి ముల్లంగి ముల్లంగి గుడ్డు కుంట
గలగరను తెల్లగురివింద కణప చిట్టి
నారకమ్మయు పుటకొక్కు నాగనేత్రి
కారు మినుమును పల్లేరు కారు శంబ

కం॥ తెల్లని యుప్పులు గలిగిన
ఆల్లా బేడకు లవంగ మాకవిరములన్
వల్లను నల్లని యుమ్మెత
తెల్లని వంగమును మోద ధృఢ మరణంబే

- తాళక భస్మము -

ఆ॥ ఆ బిడారు లవణ మాసత్తు సాంబ్రాణి
ధృతి రసంబు నెట్టి తేలు నీత
మురళి కంద రసము నెట్టటి కలుబంద
ముద్దతాళకంబు ముదియఁ జేయు

వ॥ ఏడి గురువు మూగివానికి చదువు చెప్పుతూ ముచ్చటిస్తున్నాడు
గురువు యతీశ్వరుఁడా

కం॥ భాస్కరునిచేత చీకటి
కాస్కారము రెండు కూడకల్పి పుటంబై
సంస్కార పత్రితాళము
చూస్కామ్మా! విశ్వనాథ! సురవరద పదా!

-] రస కట్టు [-

కం॥ సరసం బొక్కటి కట్టను
ధర యేలిక పెద్ద చేత ధర్మము గాదా
అరికట్ట నేరుడైతే
సిరికాదా విశ్వనాథ శివయోగ నిధీ

కం॥ క్షారము నీరము లోదే
నూరామడ కట్టుగట్టి నూకం దగునా!
యేరీడ్చి పాలుఁ గలుపుము
నేరుపదే! విశ్వనాథ! నిర్మల హృదయా!

కం॥ క్షామంబైతే యెవరికి
సోమాంకుర రసము తించు సుఖపడి యున్నన్
యేమైన లోభ మౌనా!
నీ మాయలు విశ్వనాథ! నిరుపద్ర పథా

కం॥ చెప్పుడు మాటలు నమ్మకు
తప్పుండును కనులఁజూచి తనికీ చెయుమా
ముప్పది ఉప్పని నీరే
తప్పేదీ విశ్వనాథ తత్వార్థచరా

కం॥ మక్కా ప్రక్కను కాశియు
ముక్కాకలు దీరియున్న ముగ్గుర యెదుటన్
చెక్కకు నారిని కలిపిన
తిక్కవయా విశ్వనాథ! దివ్యయశశ్రీ

కం॥ నవనీత రస సువాసిని
కువలయ దళమక్షీ జోడు కూటస్థులకున్
రవిరవిలించిన యిదిగో
శివుడాయెను విశ్వనాథ! చిత్కాశమూర్తి!

కం॥ పీరన్న గర్వ సూతము
పారక నిలుచున్న మంచి బ్రహ్మజ్ఞులచే
దారులు మీరిన బ్రహ్మము
మీరేగద! రెండుగళ్ళ మీలిన చరితా

కం॥ గౌరీ పుత్రుని వశ్యము
సిరిసంపద లాత్మసుఖము సిద్ధించుటకా
శౌరీ ఛాయను నమ్మకు
శిరికోసము శివునిఁ జంపు సింహాద్రి మునీ

శా॥ శ్రీభావంబెరిగున్న వానివశమే సిద్ధించి నా కొమ్మకున్
లోభాచారము చుర్కగాక రసమాలోచింపకన్ మాయశన్
అ భాసంబరికట్ట మిట్టిపడగా కాపున్న యా పచ్చసే
లాభంబెచ్చుగదెచ్చు నెట్టకలు పాలాక్షిల్ విహారంబుగన్

కం॥ ఆ మెంతే యరవూడగ
కామించిన డబ్బువెట్టి కలుపుట తెలరా
యేమీ! గర్వముఁ గలిగిన
సామాన్యమ! విశ్వనాధ సాధు చరిత్రా

కం॥ ఆకలి బండై తాళక
లోకా లోకములు వండి లోలోపలనే
కాకను చలువెక్కించిరి
మాకోసము విశ్వనాధ! మర్మసుబోధా!

కం॥ సాధింప వలయు యిహపర
సాధన తెరిగున్నవారు సావీరముకున్
క్రోధంబు నిల్పు మచ్చట
బోధేగద! విశ్వనాధ! పూర్ణ ప్రసాదా

కం॥ ఈ తనువు సువర్ణంబని
చేతను కాలేని పనులచే చెడితిరయో!
మూతేసి మూత్ర మిడుపుము
రేతస్సుకు విశ్వనాథ! రిపుకుల భేదా!

కం॥ ఊరూర నీరు తైలము
కారు సవీరాంతమందుఁ గాంచిన పుటమున్
మేరు పతనమై బిందువ
ఆరూఢిగ విశ్వనాధ! అవధూత పతీ!

కం॥ ఋజువుకు శివునికి నిల్పుము
భజియించును మూల జముఁడు పాలై బాగా
అజునికి అల్పము గాదా
నిజమేగదః విశ్వనాథ! నిర్మల హృదయా!

కం॥ ఔనుసుమా! రసవాదము
లౌనౌ నాఘాల భాగమౌ నద్భుతమై
చౌనేయరాదు యెవరికి
ఔనయ్యా! విశ్వనాథ! ఆర్యతపస్వీ

కం॥ అంగము లోపల లింగము
బంగారము ఉప్పు సుద్ద భాగము లెరిఁగే
గంగాధర యోగులకును
అంగములవి విశ్వనాథ! ఆచార్యనుతా!

కం॥ కల్లులు పాకముఁ జేసే
బల్లిదునకు నిహము పరము ఫలియించు గదా!
తెల్లన యెఱ్ఱన పచ్చన
చెల్లుగదా! విశ్వనాథ! శివయోగీంద్రా

కం॥ ఖండన వాదము కూడదు
కొండను గురిఁజూచి మూడు కొండల కలకం
బెండించుక మాత్రంబున
తిండియదే! విశ్వనాథ! ధీవర ధిషణా!

-: తుత్థ భస్మము :-

కం॥ రవిశోష నంటు తొత్తును
వివిధంబుగ మళ్లి మళ్లి విడుదుష్టపదే
కవిరాకు నూరి తపమున
కవునయ్యా! విశ్వనాథ! యజ్ఞాధిపతీ!

-: తాళకయోగము :-

కం॥ వాదంబు తాళకము కా
మీఁదను కాణాకు కొంచు మెదిపిన వంటే
మీదను దంపిన పిండయి
ఆదరముగ విశ్వనాథ! అనుభవ ధీరా!

కం॥ సోమార్క శిఖి త్రిలోచను
కామాదులుం బెట్టి కుండ కాలేయ వలెన్
శ్రీమీరగల్గు నదియే
శ్రీమాయా! విశ్వనాధ! శ్రీగిరి వాసా!

కం॥ వేరే మరియొక కోరిక
వారలకా రాకయుంది వాదంబు యిదే!
శారదవైతే చేయుము
శ్రీరామా! విశ్వనాథ! శ్రీగిరివాసా!

కం॥ చీకటింటిలోన చెట్టు నీడకు దెచ్చి
పారదము పుటంబు పాలుకళను
రాగి నీరు పసుపు రాజ్యంబు లేలించు
ఈధనాధికులకు నిదియె యిహము

కం॥ సీతా వేరుందెచ్చియు
చూతామా పాలుగల్పి సురసురదినమున్
వాతంబు పర్ణ జలములు
ఆ తావున నుండగోరు నాయా కలులున్

వ॥ వినుమో పార్వతీ! నింబ వృశ్చిక వస హింతాల, యజ్ఞిపాల, భూతమాల, సూకర, కూతురుబుడమ, ములుదోస, సాంబ్రాణి యూపాణ పెద్దయేలిక, త్రిధారాద్వయ, కాకరీ పుట్టపొదర కారుమినుము, కారుశంబ కానుగు భూతులసి యజ్ఞపొన్నగంటి వాడవడిశ దేవకుసుమ, కవిర సున్నం ఖర్జూరం, రెండు తలల పాము కారుటచ్చలి కోడిముల్లంగి, యెజ్ఞకుంట గలగర చిటి నారకమ్మ రుదంతులుచే పాషాణములును, మయూరు శిఖ గంధకం సిద్దపంచకాదులతో శుద్దరసంబును, ములు నిద్రగన్నె మెంతె నవాసారము, పుట్ట కొక్కు తెల్లని గరిక, కణప,

ఉత్తరేణి ములుదోట, ముద్దబెంక, పిట్టకాలు, సిద్దపంచకాదులతో రజితమును, చిత్రి, ఉత్తరేణి, ములుదోట, దుంపరాష్ట్రముతో సత్తుయును, వెలిమిడి పూతిక రత్నపురుషములతో నాగమును యూషాణము, తంగేడు, గోరింత, రావి, వాము, గంజాయి, మామిడి నేపాళములతో వంగమును, వెలగ జిల్లేడు పస కడుగు సున్నము పసపు అరటి పీట్లతో పాషాణములును, సుగంధకము నాగజముడు జిల్లేడు పెద్ధమందు పీట్లతో నింగిలీకమును, పసరిక పాము, ఖర్జూరము, ములక జిల్లేడు బ్రహ్మదండి పీట్లతో మైలతుత్థమును, గలిజరు, పటిక, సురాకారము, బోడతరము, కర్పూరవల్లి గోరింత బ్రహ్మదండి, నేలవేము, జిల్లేడు, హింతాళము, నారికేళము, తాళము, జీలుగు, వనితాగోమయము కిట్టలినార మలములతో తాళకమును, తెల్లరాకామిదె నేరేడు యింగిలీకము సిద్దపంచకాదులతో ఇనుమును, వాటి వాటి సాధనములు నెఱింగి యుంటె మహిమలుగా భస్మములుగా గలవు. ఈ చెప్పిన వాటిలో సువర్ణ పర్వతమును మహామ్మేరు వయును రెండు పర్వతములు, కైలాస మెక్కడనో, అంత ర్భూతమై యుండెననియు, పార్వతీ! నీకు జ్యోతకంబైయుండు నవి యేవిధంబులు గలవా డెందంబులకు నందిరాక పదియారు వన్నెలుగల నపరంజియు, పాలమీగడ కధికంబునై తరుగు యిరుగులు లేక యుండుననియు, బుద్ధిమంతులగు యోగ జ్ఞానులకు నలవడు, యిందు మరియొకటి షరమా యని మసానులు సిద్దులు కొనియాడుదురు. దానిని పరుసమని దేవతలు నాక్కాణింతురు. కాన నీ వెఱుంగరానివి, యేమి యున్ లేవు. ఆకర్ణింపుము. ఏడిగురువు అంగడిలో నాడు చున్నాడు గురువు నాణ్యముల

కం॥ ముక్కుకు ముప్పై వరహా
లక్కర గలవారి చేతి కందీయ్యవలెన్
అక్కరలేనివి యాభై
మక్కువలా? విశ్వనాధ! మహాయోగీశా!

కం॥ మూడవ కంటిని శివునకు
కాడేర్పడఁ జేయ బ్రహ్మకలియుఁట కొఱకే
జాడలు యాభై చేసుకొ!
ఆడాడకు విశ్వనాధ! అచార్య వరా!

కం॥ చచ్చిన నిలిచిన శివునికి
అచ్చుబడై యుండవలయు నాయాపనికిన్
కుచ్చితులు గారు గురువులు
ముచ్చలయా! విశ్వనాధ! ముద్రారణ్యా

కం॥ ఱాలను వండిన యినుమగు
పాలును గురుతెఱిఁగి పరళు పారద భస్మమ్
శీలమగును చురికించిన
మేలిమి బంగార మౌట మేళనము సుమా!

కం॥ పారదముఁ దెచ్చి నాగము
చేరువ గావింప నదియు శీఘ్రముగానే
వేరును చేయక కలియును
కారణ తనులాంతరంగ! కనులగను 'లయమ్'

-: సిద్ధ జయంబగు ముప్పు యోగము :-

కం॥ వినుమా! పార్వతీ! ముప్పున
ఘనమగు సున్నంబు ఱాలు కరుగుట యరుదా!
వనమేల యోగి వరులకు
ధనముకు ధాతువుల రంగు తప్పకఁ గలుగున్

కం॥ ముప్పును చేసే క్రమమును
చెప్పుదు రాజ్ఞాను లంతఁ జేసి యుపాధిన్
ఒప్పిదముగ సాధించిరి
అప్పగిదియు, దానినేమి యౌనా విధమున్

సీ॥ ఫాలముల్ పెట్లుప్పు పసిబాల మూత్రమ్ము
ఇన్నమూకుడులోన నీ పొడు మిడి
నీరార వండి పై నీరు పోసియు కడ్గి
యెండిచి యీశకు నేడు ఫలము
అరయ నాలవణంబు నందును గల నేసి
యిరుదినంబు లిగుర నెండనిచ్చి
అరనూరు పిడకలందదియు నిమ్మగ గాల్చి
పసిబాల నీరుతో బాగ నూరి

తే॥ వార మెండిన వడియముల్ వాటపరచి
షోడశంబగు పిడకల నూటిగాను
పుటము లీలాగు పదియును బూర్తి చేసి
అందుపై నల్ల స్త్రీ మాయ నమర దెచ్చి

కం॥ రెండున్నర ఫల మారతి
నిండా కర్పూరమందు నేర్పున నాపై
కుండను బట్టగ జేసియు
నిండా మూత్రమిడి యెండ నెండిన వారమ్

కం॥ అది దినము పిసికి సారము
కుదురుగ నామందు పాలుఁగొని కలియంగా
గదియించి గాజు కుండను
పదిలముగా పాతు నాల్గు పదులు దినములున్

తే॥ దీనిలో నాదమును పుట్టగాను పూజ
నిష్టగా జేసి యిగురు నెండించి పైని
చెప్పియున్న ప్రకారంబు చేసి మందు
గాజుకుండకు లోపుగా గళము నింద

తే॥ మెత్తి లోపల మందుంచి మీద మూసి
చీర గావించి వంటు చేసీ క్రమాన
దీప కమలము గాఢమున్ ధీరుఁ డగుచు
ఝూము ఝూమున కడు ఝూము సరస వండి

తే॥ తీసి మూసలలో మెత్తు తీసి మూత్ర
మేసి నూరియు నొక వార మెండ పుటము
నిచ్చి మూసకు మొదట దానిచ్చి నటుల
గాను యంతయు పూర్ణంబుగాను జరిపి

తే॥ ఇటుల ముమ్మారు వండిన వెనుక మందు
తెల్లగా నుండవలయును తేటగాను
బిందువును కోకలోఁ గల్పి పిడచ కట్టి
పుష్య మాసాలలో మంచు పూర్ణమగును

తే॥ గాజుపై బెట్ట మందులోగాను బెట్టి
వారమందు నిండుగ జయనీరు దీసి
అదియు సీసాన బోసియి అర్క పుటము
వాటమైయున్నఁ గొని జయవారితోను

కం॥ ఆ మందు నీరు గలిపియు
యే మరువక పది దినాలు యెండించి పుటం
భూమిని పాతియు అయిదే
సామాన్యపు పిడక లవుర సాధన 'సున్నమ్'

వ॥ పార్వతీ! పెల్లుప్పు యనగా మాఘ ఫాల్గుణ మాసంబులలో చౌడునేలను గానీ చౌడుయిండ్లను గానీ తెల్లగా సురాకారమువలె దూదివలనే పుట్టును. మరియు దీపాగ్ని కమలాగ్ని గాఢాగ్ను లకు నారికేళపత్రంబు లుండవలయును. ముప్పుసున్నము గలది యగు సాపుణ్యాజనులు త్రిలోక జయులయ్యేదరది యెట్లంటేను సిద్ధపంచకంబు వలనే సమస్తంబు యగును. ఇంతియె కాదు కాయసిద్ధియు లోహముల రంగు ఛేధించి మనోహరంబుగా నుండునని యెరుంగుము.

:- శ్రీసనారీ సిద్ధజయ ముప్పు సున్న యోగము -:

ఈ ముప్పు సన్నములో పూనీరును హారతి కర్పూరముతో సున్నముగా మార్చుకొని ఆసున్నముతో సమము నవాక్షారమును జేర్చి జయనీరు తీసుకొని ఆరతి కర్పూరముతో తయారైన పూనీరు సున్నమును పై జయ నీరుతో భావన చేసి నూరి భూమిలో పాతిపెట్టి ఐదు పిడకలలో పుటము వేయులాగున వ్రాయబడియున్నది. ఈ సున్నము తెల్లగాను తేటగా నుండ వలెను.

క్షీరాబ్ధి మథన సంభవామృత ఘటకరగ్రాహా మోహినియునై దానోద్రేక నౌదార్య దర్వియుంబట్టి సత్పాత్రాధీన జ్ఞానులం వీక్షింపు చున్నది. సంపూర్ణమ్.

-: మరియొక ముప్పు సున్న యోగము :-

సముద్ర లవణము ఒక భాగము తాళ్ళ సున్నముతో జేరిన దుచ్చున ఒక భాగము, నవాక్షారము ఒక భాగము, ఈ మూ డింటికి సమముగ పొంగించిన పటికను జేర్చి నూరి వస్త్ర ఘాళితము జేసిన కడుంగార ముప్పు సున్నమగును. మరియు

కూటియుప్పు ఒకభాగము కట్టిన సోరుప్పు అనగా సున్నముతో జేరిన సోరుప్పు ఒక భాగము పొంగించిన పటికారము మూడు భాగములు చేర్చి నూరి శుభ్రమైన నీరు గలిపి మెదిచి బిళ్ళ చేసి 4,5 నుగ్గులలో పుటము బెట్టి తీసుకొనిన తర్వాత దీనిలో ఒక భాగము నవాక్షారమునుచేర్చి బాగుగానూరి వస్త్రఘాళితము చేసిన కడుంగార ముప్పు సున్నమగును. సాఫుణ్య జనులు నీ ముప్పు సున్నము మహిమతో ముల్లోకములు జయించెదరు. ఈ ముప్పు సున్నమును గంధకమునకు రెండింతలు చేర్చుకో వలయునని చెప్పబడెను. వాదము ముగిసెను. ఓం తత్స్. శ్రీసనారీ విశ్వేశ్వర వాద విద్యా ప్రకటిత పద్యంబులకు ఆంధ్ర భాషావచన వ్యాఖ్యానము నాచే రచింపఁ బడినది. చదివినచో నన్నియు సులభ గ్రాహ్యములగును. గ్రంధ విస్తర భీతిచే నిందు వదిలితిని. శ్రీ కృష్ణార్పణమస్తు.

-: రస పరికరణము :-

-: రస ఘుటికా ధారణ క్రిమము :-

సీ॥ శంభు వీర్యాణు పక్షచ్ఛేద మొనరించి
దివ్యౌషధులఁ జేర్చి తెలిసి నూరి
అమల రసాణువు లాద్యంత మతికించి
వహ్నిపాకంబున వండి తీసి
పూర్ణబద్ధ మొనర్చి మూసఁ జేర్చి గఱంగి
నిష్టతోఁ జిత్తంబు నిలిపివేడ్క
ఘుటికను గావించి కోర్కె మీరగ దానిఁ
దనమెడ మణివోలె దనరఁ దాల్చి

తే॥ భైరవునిఁ గొల్చి వైద్యంబు పారదమును
తప్తకల్వంబునను గూర్చి తనియ నూరి
పదునెనిమిది శుద్ధులు శాస్త్ర పద్ధతిగను
జేసి యోగంబులందిడ సిద్ధిఁ గలుగు

-: పారద జాతులు :-

సీ॥ స్వచ్ఛమైన రసంబు బ్రహ్మజాతి సమస్త
కల్పంబులందిడఁ గలుగు మేలు
రక్తవర్ణంబైన రసము క్షత్రియ జాతి
ఘుటిక యోగము లందుఁ గూర్చ శుభము
పసుపుపచ్చని రంగు రసము వైశ్య కులంబు
రసయోగములఁ జేర్చ లాభమొదవు
లోన వెల్పుల నల్పు రూఢిగాఁ గన్పించు
సూతము చిద్వస్తు శూద్ర జాతి

తే॥ సర్వయోగ ప్రశస్తంబు శాస్త్ర విధుల
నరసి యష్టాదశగతుల నెఱిఁగి పార
దమును సంస్కరించిన నది క్రమముగాను
ఘనతరంబుగ లోహభక్షణముఁ జేయు

వ॥ అట్టి యష్టాదశ సంస్కారంబు లెవ్వియనిన "స్వేదన, మర్ధన, మూర్ఛనోత్థాపన పాతన, నియమన, సందీప నానువాసన, గగనాదిగ్రాస, చారణ, గర్భద్రుతి, బాహ్యధృతి, యోగజారణ, రంజన, సారణ, క్రామణ, వేధన, భక్షణంబులను, నామంబులం బ్రసిద్ధంబులై యుండు. ఈ యష్టాదశ సంస్కారంబులవలన సూతేంద్రంబు మహా యోగానుకూలంబునై మోక్షప్రదాతయై దీర్ఘాయురారోగ్య వైభవములం గలుగఁ జేయు మఱియును.

సీ॥ భద్ర పారదమును స్వల్ప మోతాదులు
భక్షించిరేనియు వపువునందు
ఆమ్లరసాదుల నదిచేరి త్వఙ్మాంస
ముల నాశయించి సంపూర్ణముగను
ఆమాశయముఁ జేరి నప్పుడె స్వర్జిక
ముగ మారు నిదియు ప్రేవులను జేరి
భాగాంశములలోన నాగంధకద్రుతి
గాను మారును విను కమలనాథ!

తే॥ ప్రకృతి బలముఁ బెంపొందించి రక్తమునకు
జీవరక్త కణాలకు సిద్ధి నొసఁగు
శంభు వీర్యాఖ్య సమితి యోషధులఁ గఱఁగి
స్థూలముగ లోహతతుల సింధురముఁ జేయు

వ॥ మరియు శుద్ధరస కజ్జలి యకృత్ప్లీహోదర వ్యాధులఁబోకార్చి సుఖంబొసంగును. ఇది యనుభూత మగుట నిందుదహరించితి.

తే॥ సంస్కరింపని సూతంబసాధు వగుట
వహ్నిముఖమునఁ జెడి వెసఁ బారిపోవు
జారణాదులు గావించి పారదమును
బద్ధ మొనరింప నది గాదె సిద్ధకరణి

ఆ॥ ఎంతఁ బ్రొతగిలిన నంత రెండింతలు
గుణము లొదవఁ జేయు గొప్ప రసము!
రసము లేని మందు కసవుతో సమమయి
మగడు లేని మగువ సగిది చెడదె

-: రస స్వేదన విధానము :-

వ॥ లభ్యమైనంతవరకు పొట్టొలిచిన సర్వధాన్యములు నొక కుండలో బోసి నీళ్లు కావలసినంత పట్టు గల్పి లెస్సగా పులియ జేసి యందులో తుంగముస్తెలు, సరస్వతి యాకు, బోడతరము, శ్వేత విష్ణు క్రాంతము, గలిజేరు, పొన్నగంటి, సర్పాక్షి, సహదేవి, పిల్లితేగలు, త్రిఫలములు గిరికర్ణిక, హంసపాది, చిత్రమూల మీ పదమూడింటిని మూలముల గ్రహించి ముద్దగ నూరి యందులో వైచి కలియబెట్టి బాగుగా పులియు లాగున గావించి మరియును త్రికటుకములు, ఉప్పు, ఆవాలు, వెల్లుల్లి త్రిఫలములు, అల్లము, మహాబల, నాగబల, చిత్రికూర, గలి

జేరు, మేషశృంగి, చిత్రమూలము, నవాసారము, సమభాగ ములుగ గ్రహించి రసమునకు పదునారవ భాగము నొకొక వస్తువు చొప్పున సంపాదించి కూర్చుకొని యన్నింటిని, కుండ లోని యామ్లముచే నూరి మైనమొనర్చి యీ ముద్దను శుభ్ర మైన దళసరి వస్త్రంబునబోసి దానిమధ్యంబున పాదరసముంచి మూటగట్టి మూడహోరాత్రంబులు తదామ్లంబుఁ బూరింపబడి యుండు డోలా యంత్రంబున వండిన రసము స్వేదితమగును.

### -; మర్ధన విధి ;-

రసమునకు పదునారవ భాగము కరిధూపము, ఇటుక పొడి, పెరుగు బెల్లము, ఉప్పు, ఆవాలు గ్రహించి కల్వమున నూరినచో మర్దన మనిపించుకొనును.

### -; మూర్చా విధానము :-

రసమును కలుబంద రసముచే మర్దించిన మలదోషంబును త్రిఫలములచే మర్దించిన వహ్ని దోషంబును, చిత్రమూల రసముచే మర్దించిన విషదోషంబును నిర్మూలించును. కల్బంద రసము, త్రిఫలము,చిత్రమూలము, నిమ్మూటిని యేకంబొనర్చి యెనిమిది దినంబులు రసమును మర్దించిన మూర్ఛితమగును.

### -; రసమునందలి కంచుకాది దోషముల హరింపఁజేయు విధానము ;-

కలుబంద, చిత్రమూలము, ఎర్రావాలు, పెద్ద ములక, త్రిఫల ములు, కషాయముచే రసమును మూడు దినములు మర్ధించిన సప్తకంచుకాది దోషములు హరించును.

### -; రసోత్థాపన విధానము ;-

రసంబును నిమ్మపండ్ల రసంబులో వడిపి యెండలో నెండించిన రసము పైకి చిమ్మును. ఇంకను మిగిలియున్న రసమును

పాతనా యంత్రముద్వారా పైకుండకు సంక్రమించిన రసమును గ్రహించవలెను.

## -: పాతన విధానము :-

అధఃపాతనము, ఊర్ధ్వపాతనము, తిర్యక్పాతనము అని మూడు విధములు. అందు ఊర్ధ్వపాతనము ఎట్లనిన వినుము. మూడు భాగముల రసమునకు ఒక భాగము తామ్రమును జేర్చి ముద్దగా నగువరకు నిమ్మకాయ రసముతో నూరవలెను. ఆ ముద్దను క్రింది కుండలోవేసి పై కుండనుకప్పి దానిపై నీరు నిలుచుటకు కుదురు నేర్పరచి యందు చల్లటి నీరుబోసి క్రింది కుండ క్రింద నాలుగు ఝామములు మంట బెట్టవలెను. రసము పై కుండ కంటుకొనును.

## -: అధఃపాతనా విధానము :-

త్రిఫలములు, మునగచెక్క, చిత్రమూలము, ఉప్పు, ఆవాలు ఇవి సమభాగములుగ గ్రహించి పై కుండలో భాగమున కంటు కొనిన నష్టపిష్టముతో కలియనూరి మఱలా పై కుండలో పై భాగమున పూయవలెను. క్రింది కుండలో నీరు పోయుము. రెండు కుండ లతికించి సంధి బంధనమును చేయవలయును. అది భూమిలో కప్పిపెట్టి దానిపైన పుటము వేయవలెను. కుండకు బూపిన పిష్టములో నుండి రసము నీటిలో బడును.

## :- తిర్యక్పాతన విధానము -:

ఒక కుండలో రసమును బోసి రెండవ కుండలో జలమును బోసి రెండు కుండ లడ్డుగా గలిపి సంధి బంధనముజేసి ప్రొయ్యిమీద పెట్టి రసముగల కుండ క్రింద మంట బెట్టవలెను. అప్పుడు రసము నీరుగల కుండలో బడును. ఇది తిర్యక్పాతనము.

:- బోధన విధానము -:

కొబ్బరి చిప్పలోగాని, గాజు కుప్పెలోగాని, సైంధవ లవణపు నీటిని [మతాంతరము] నిరోగియగు స్త్రీ యార్తవమును బోసి యందు రసమువైచి బార లోతుగల భూమిలో మూడు దినములు కప్పిపెట్టి యుంచిన రసముషండ దోషమును వదలి ప్రబోధముఁ గాంచును.

-: నియమనము విధానము :-

సర్పాక్షీ, చింత, గొడ్డు కాకర, కర్కాటక శృంగి, తుంగదుంపలు, ఉమ్మెత్త, వీని రసములతో స్వేదన మొనరించిన రసము, నియమమగు స్థిరత్వము బొందును.

:- సందీపన విధానము -:

కాసీసము, పంచ లవణములు, ఆవాలు, మిరియములు, మునగ, అడవి మునగవిత్తులు, టంకణముతో గలిపి, కాంజికములో గలిపి, చిలికి మూడు రోజులు డోలా యంత్రమున వండిన రసమునకు దీపనము గలుగును. లేక చిత్రమూలము, కాంజికముతోనైనను వండవలయును.

-: అనువాసన విధానము :-

దీపితమైన రసము నిమ్మకాయ రసములో గలిపి కుండమూకుడు లేక రాతి మూకుడులోగాని వేసి యెండబెట్టిన అనువాసితమగును.

రసమునందలి సప్త కంచుకాది దోషములు తొలగిపోయినట్లు
- తెలుసుకొను విధానము -

మొదట వేసిన రసములో నెనిమిదవ భాగము మిగిలియున్న యెడల యేడు కంచుక దోషములు హరించినట్లు తెలియవలయును.

- రసజారణ విధానము -

జారణ మనగా గాలన పాతములకు వ్యతిరేకముగా మిక్కిలి ఘనమగు స్వర్ణాది లోహములను గ్రాస మొనరించి పూర్వ రూపమును బొందుటయే జారణ మనబడును. ఒక దినప్రమాణము రసము నెవఁ డగ్ని యందుంచగలడో వాఁడు సర్వ పాప విముక్తుడై మోక్షమును బొందును. రసమును జారణముచేయ కెవడైతే ఫలమును వాంఛించునో వాఁడు భూమిని దున్నక విత్తనములు చల్లక ఫలమును వాంఛించు కృషీవలునివలె మందబుద్ధి గలవాఁడగును. మొదట అభ్రక జారణమును పిమ్మట గర్భద్రుతి జారణమును తుదినియా తర్వాత స్వర్ణ జారణమును యెఁవడెఱుగ కుండనో యట్టి రసవాది నిష్ఫలుఁడగును.

- గంధక జారణ విధము -

సమాన గంధకమున రసము జీర్ణమగుచో శతగుణాధికమై దగును. రెండు రెట్లు గంధకముతో జీర్ణమగుచో సమస్త కుష్టువులఁడ్ జేయును. త్రిగుణ గంధకమున జీర్ణమగుచో సమస్త జాడ్యములును హరించును. చతుర్గుణ గంధక జారిత రసము పలీపలిత నాశన మొన రించును. పంచగుణ గంధక జీర్ణమగు రసము క్షయ రోగహరమై పరంగును, షడ్గుణ గంధక జారిత రసము సర్వ రోగహరమైనదిగా యుండును. పరిశుద్ధమైనదయ్యును, గంధక జారితముగాని రసము యోగ ములందు వాడకూడదు.

- రసశోధన విధానము -

ఆవాలు వెల్లుల్లియు మెత్తగా నూరి మూసగా నిర్మించి యామూసలో రసమును బంధింపవలెను. దానిని గుడ్డను మూటకట్టి మూడు రోజులు కాంజికమున డోలా యంత్రమందు వండవలయును. పిమ్మట దానిని తీసి కలుబొంద రసమున నొకరోజు మర్ధనముఁ జేయవలయును. పిమ్మట

చిత్రమూల రసముతో నొక పర్యాయము నూరవలయును. కాచికూర రసముతో నొకపర్యాయము త్రిఫలముతో నొక పర్యాయమును మర్ధన జేసిన పిమ్మట రసమున కాంజికముతో గడిగి వేరుచేయవలెను. ఆ రసము కల్వమున నుంచి రసములో సగభాగము సైంధవ లవణమును గలిపి నిమ్మకాయరసముతో నొక దినము నూరవలెను. పిమ్మట ఆవాలు వెల్లుల్లి నవాసారము, రసమును సమభాగములు గ్రహించి కడుగుతో నూరవలయును. పిమ్మట యింగువ ముద్దబూసిన క్రింది స్థాళీయందు రసము నుంచి సంపుట మొనరించి ఆ స్థాళిని లవణముచే పూరించి క్రిందను మంట బెట్టుచు స్థాళీపై నీరు చల్లుచున్న మూడు యామములకు పై స్థాళిలో భాగమున నంటుకొనును. అది పరిశుద్ధముగా నుండునని యెరుంగునది.

- స్వర్ణ జారణము -

రసమునకు తీక్ష్ణమైన బుబుక్ష గలుగ జేసినచో స్వర్ణమును భక్షించును. తీక్ష్ణకంటకములుగల ఆకు జముడు, మావికర్ర, నెనిమిది యంగుళములు దొలిచి అందు రసము నునిచి బిలము కప్పి ఆవు పేడ పిడకలతో శోషింపం జేసిన రసము స్వర్ణమును గ్రసించును. మరియు షడ్గుణ బలిజారిత రసము స్వర్ణమును గ్రసించును. వీనికే బిడములని సంజ్ఞాపదములు గలవు.

- గర్భద్రుతి -

అభ్రక సత్వమునకు సమభాగముగ మాక్షిక సత్వమును కలిపి అందు రసమును బంధించిన రసము గర్భమున ద్రవించును. అగ్ని సంస్కారము లేకపోయినను రసము లోహాదులను ద్రవింపం జేయును. ఇది గర్భద్రుతి యనంబరగు

- రంజనము -

శుద్ధ తామ్రము రసమునందు మూడవ వంతు జీర్ణమైన యా రసము కుంకుమ రంగును భజించును.

- రస భస్మ విధానము -

రసమును లవణ యంత్రమున వండిన రసము భస్మమగును. మరియు రసమును తమలపాకుల రసముతో మర్ధించి గొడ్డుకాకర దుంపలో నుంచి ఆ దుంప మూకుడులో నుంచి రెండవ మూకుడుచే సంపుట మొనరించి వండిన రసము భస్మ మగును.

ఓం తత్స.

సంపూర్ణము

Acc-no. 5811 - 615 53 - Rs 20=00
NAR

రస ఘుటికా ప్రకరణము

నరసింహాచార్యులు, అన్నదానం.

- రసఘుటికా విధానము -

సీ॥ శుద్ధిచేసిన మహాసూతంబు తెల్లుప్పి
పండ్ల రసంబున భస్మ కల్క
మగుదాక మర్ధించి యండంబు గూటిలో
జొనిపి గోధుమ పిండి చుట్టుమెత్తి
యెండించుచు మినప పిండిని యా పైన
బట్టించి యెండించి దిట్టముగను
ఉసరిక పిండిని పొసగించి రాచుచు
యెండించి గుమ్మడి పండులోన

తే॥ భద్రతనిడి యద్దానిపై బట్టె పేడ
మందముగ బూసి యెండ్చించి మదవరాహ
పుటము నందిడి కాల్చినం బొసంగ గట్టు
కట్టిన రసంబు మాత్రగా గట్టి మరియు

తే॥ మేల్మి యుమ్మెత్త విత్తులు మేకపాలు
నూరి యెండించి పొడిచేసి నేయుప్పుగను
దండి పాతాళ యంత్రాన తైలమొడిచి
అందు నలుజాలు డోల యంత్రాన వండి

కం॥ తీసిన తద్రస ఘుటికను
గాసిల్లిన నురగ కాటు కదిమిన విషమున్
వాసి చను దారణంబున
గోసాయిలు నిత్య శుభముఁ గొండ్రు మురారీ!

- క్షీరగ్రాహ ఘుటికా విధానము -

సీ॥ శుద్ది చేసిన మంచి సూతంబొక తులంబు
నప్పుడే యీనిన యావు ముట్టు
తోఁ గల్కమగుదాక బాగుగా మర్దించి
యా కల్కమును యుమ్మెత్తాకు నందు
బొదిగి పాతను గట్టి ముడివైచి యటికలో
వెస తూమెడుమ్మెత్త రసముబోసి
డోలికా యంత్రాన బ్రేలగట్టుచు నాల్గు
ఝాములు సన్నని జ్వాలఁ దగుల
బసరింక వండిన పారదమా క్షణ
మున గట్టియుండును కనక బీజ

తే॥ తైలమున దాని నాలుగు జాలు విధిగ
వండిరేనియు ఘుటికగు పాలుఁ ద్రావు
పటిమ గలుగు క్షీరగ్రాహ ఘుటిక యిదియె
ధారణముజేయు మనుజులు ధన్యులభవ

- సిద్దరస ఘుటికా విధానము -

సీ॥ గంజాయి విత్తులు కనక విత్తులు సుద్ధ
నామము సూతంబు నల్లనాభి
సమముగా నన్నింటు నాల్గు గగము లెత్తు
మర్దించి పొడిచేసి మంటి కొళిపి
కర్ధభాగము బోసి యందుపై యుమ్మెత్త
తైలాన వండిన దర్ప ఘుటిక
నందున నొకటందు సంధించి యా చూరు
వాయి మున్గెడు దాక బట్టి కూరి

తే॥ మూసి చీల బిగించుచు పొసగ దానిఁ
బూర్తి యెండించి కుక్కుట పుటము బెట్ట
నవ్య ఘుటికగు తైలాన నాల్గు ఝూము
లివ్వ గరిటెన చురికించి యింపెసంగ

కం॥ క్షీరమున నద్ది యది చ
ల్లారిన మీదటను సిద్ధరస ఘుటికగు త
ద్ధారణముఁ జేసిరేనియు
శ్రీరుచి సంధిలఁగ సకల సిద్ధుల నిచ్చున్

= స్థంభన రస ఘుటికా విధానము =

సీ॥ సారపు కన్యకుమారి యాకు రసాన
జెలిమి శుద్ధ రసమ్ము తులముఁ గలిపి
భస్మ మయ్యెడుదాక బాగుగా మర్ధించి
కోడిగుడ్డును దొల్చి గూడులోన
పచ్చియుమ్మెత్తాకు పైనంబుగా నిడి
యందు తద్భస్మంబు నమర బోసి
మూసి మైనము మెత్తి పొసఁగ చీలమరించి
పారావత పుటంబు వైచి తీసి

తే॥ యారసంబును కన్యకుమారి రసము
చేత మర్ధించి పొడిచేసి చెప్పినట్లు
కొన్ని పుటములు వైచిన వన్నెగలిగి
స్తంభన రసఘుటికగునో చన్నరాయ

ఆ॥ ఇటిక దొలిచి గ్రుడ్డు నిటుక లోపల బెట్టి
యిటిక యొకటి పైన నిడి తుది మొద
లారు చీరలిచ్చి యారించి గుంటలో
గంపెడు పిడకలిడి కాల్చవలయు

వ॥ ఇది పారావత పుట క్రమం బనంబడు

♦ క్షీర రక్త గ్రాహ ఘుటికా విధానము ♦

కం॥ వరహా యెత్తు రసంబును
వర స్వర్ణము మాడ యెత్తు వనతులపిదళో
త్థరసమున నూర ముద్దగు
మరియును వన తులసి నాభి - మర్దించి వెసన్

తే॥ రెండు చిప్పలు చేసి నీరెండబెట్టి
యందులో మందు ముద్ద నింపొంద మాటి
మూస నిడి కుండలో బెట్టి పొయ్యిపైన
మూస మసియగు పాకంబుఁ బొంద వండి
దీసిన రసంబు గుళిగయై తేజరిల్లు

కం॥ క్షీరము మైజెడు రక్తము
నోరను ద్రావు ఘుటికగుట న్యూనత గదలన్
ధీభిషక్పతు లెల్లరు
ధారణ సేయుదురు భక్తి దానిన్ మేనన్

♦ ఘోరాభిరామ ఘుటికాక్రమము ♦

ఆ॥ దొమ్మదోలుగడ్డ దొలిసి నిండుగ రసం
బిడి ముఖంబు మూసి పెద్ద జమ్ముడు
జిల్లెడు కుజజనిత క్షీరము లీ రెండు
డోల యంత్రమునను వ్రేలగట్టి

కం॥ ఎనిమిది ఝాములు వండిన
ఘన పాషాణమగు దానిఁగైకొని యండం
బున నిడి మృత్తిక చీలిడి
యెనయగ నయ మూసఁ జేర్చి యేనుగు పుటమున్

తే॥ పెట్టి సాంగశీతలమున బట్టి తీసి
చూడ నా ఘుటికకు మోము లేదు మేల్మి
కన్నులు మొలిచి యుండును యెన్నొ పనులు
రాణ చేకూర్చు ఘోరాభిరామ ఘుటికా.
దారణముఁజేయు మనుజులు ధన్యులీశ!

* రసవజ్ర క్షీరగ్రాహఘుటికా విధానము *

కం॥ పిన నేల తాడి గడ్డలు
చనచర్ల సమూల మొక రసంబున సూతం
బును చిత్రమూల రసమున
నెనయగ దక్షిణప్రదేశ మింగువ నిడుచున్

కం॥ దిట్టత నూరిన రసమును
బట్టను ముడివైచి చెప్పఁ బడిన పసరులన్
బట్టుచు డోలా యంత్రము
గట్టుచు పాకంబొనర్పగా వజ్రమగున్

కం॥ ఈ రస వజ్రంబు మహో
దారత నుమ్మెత్త పసరు తైలంబులలో
గూరిమి చురికించిన నది
క్షీరగ్రాహ ఘుటికగును సిద్ధప్రదమై

* రాక్షస ముఖ రస ఘుటికా విదానము *

సీ॥ రసము మూడు తులాలు పసపున నొకనాడు
మర్దించి వడబోసి మరియు తెల్ల
గబ్బేరు వేరున గలిజరు పసరున
నీ రెండు ద్రవ్యాలు చేర్చు చిటుల
నల్లపత్తేకును నలిచి దీయు రసాన
మెస నూరి గరిటలో వెచ్చ జేసి
కొబ్బరి చిప్పలో గూర్చి రసంబెల్ల
అవనూనెను బోసి యపుడె పచ్చి

తే॥ వేపకట్టెతో రుద్దిన వేగిరమున
గట్టు నాగవల్లీ పత్రకమున జుట్టి
పెద్ద వంకాయలో బెట్టి పెంతెల నిడి
తుషపుటము లై దిడిన నది తుష్టి గట్టు.

కం॥ ఇంకను యీరస ఘుటికను
టింకముగా వంటకమున బెక్కుగతుల ని
శ్శంకత వండిన గనుగవ
లంకురమై మొలుచు రాక్షసాఖ్యం జెలంగున్

♦ రక్తగ్రాహ ఘుటికా విదానము ♦

సీ॥ మైలతుత్థముదుగపాలు సూతంబొక్క-
పాలు నుమ్మెత్తాకు పసురుచేత
నూరిన ముద్దను నొక పాతనిడ్డి కట్టి
డోలిక నుమ్మెత్త తైలమునను
నాలుగు ఝూములు నయముగా వండిన
ఘుటికగు దానిని పటిమ గలుగు
ఉమ్మెత్త కాయల నుడికించి ముడుగుదా
మెరపాకు పసరున మెఱయ వండి

ఆ॥ నాభిగడ్డ తొలిసి నా రసఘుటికను
మాటి పందిబొడ్డు మాంసమునను
బెట్టిడోల యంత్ర విధిని తైలములోన
వండ వజ్ర మగును పరమ పురుష

కం॥ ఈ రసవజ్రము సోకిన
ఘోరోరగ దంష్ట్రి విషముఁ గూలుచ్ జెలుచవ్
పూరుషుని నడుము నొప్పులు
దీరుచు గూఢారణ్యమున దివ్యత్వ మిడున్

-: అక్షమాల రసఘుటికా విధానము :-

సీ॥ వెండికాదేకారు రెండు భేదల యెత్తు
తులమెత్తు రసమున గలియమారి
జుట్టుపాకు రసానఁ జురుకుగా మర్దించి
యది గజ్రమూస నింపార గరఁగి
మంచి ముత్యము రీతి మాత్రలు గావించి
కాళపుల్లలుఁ జెక్కి కడకు బెట్టి
ననిమ్మ పండ్ల రసంబున దడుపుచు
నెండించి పుల్లలు నెత్తివైచి

తే॥ తామ్రమునఁ బట్టిదారంబు దూర్చి యక్ష
మాలగాగూర్చి గళమున లీలఁదాల్చ
నరుఁడిల మహాబలుండనఁ బరగియెపుడు
పండితారాధ్యుడుఁడగునయ్య! పంకజాక్ష.

తే॥ అప్పుడప్పుడె పిండిన యావుపాల
లోన నీగుళిగెల నద్దిరేని తక్ష
ణమున దధియగు దానిని క్రమముగాను
కడుపులోనికిఁగొనిన రోగములు మాను.

:- వరాహబద్ధ రస ఘటికా విధానము :-

సీ॥ కుట్టియా తొలుచూలు గున్న పందిని బట్టి
కూనలన్నిటిఁ బూర్తి యీననిచ్చి
మొదట యీనిన పిల్ల కుదరంబు నిండుగ
తల్లిపాలను ద్రాపి తనియఁ జేసి
పాపు పాదరసంబుఁ ద్రావ వాతను బోసి
నవరంధ్రములు తక్షణమునఁ గూర్చి
దానిని మేలైన దారంబుతోఁ జుట్టి
గుమ్మడి పండును గోసి యందు
భద్రత నిడిమూసి బంధించి చేలిచ్చి
గజపుటంబున గాల్చి కడకు దీసి

తే॥ దానిలోఁ గట్టియుండు పాదరస ఘుటిక
క్షీరమున నద్ది తగరంబు శేరు గఱఁగి
యందిడిన నది జిర్రున నచటఁ దిరిగి
వంగ లోహపు నీటిని మ్రింగివైచు
పిచ్చిలోహపు తగరంబు వెండి యగును

కం॥ అందున్న రసపు గుళిగెను
జెందిన వేడుకగ దీసి క్షీరంబులలో
నందుంచి నద్ది తీసియు
పొందిక దాచంగ వలయు పుణ్యాత్మ లిలన్

–: రస ఘుటికా సింధూర కళంకు విదానము :–

సీ॥ మోదుగ వార్జప పువ్వులు కుసుమదా
సాని దాడింబ పుష్పములు దెచ్చి
సమపాళ్లగా గొని సననిమ్మ పులుసున
నన్నియు మర్దించి యలగకాయ
పరిమాణమునజేసి పారద ఘుటికను
అధరోత్తరాలుగ నందుఁ బొదివి
యేడు చీలలమర్చి యెండించి దానిని
ముప్పది పిడకలఁ బుటము దీర్చ

తే॥ బాల సూర్యోదయులీల మేలి నెమలి
కంఠమును బోలి యది కళంకమగు గింజ
యెత్తు నొక తుల వెండి నింపెసఁగ గఱఁగి
వైచినను స్వర్ణమగు పది వన్నెలీశ

-! హింగుళ బద్ధము ;-

తే॥ పొసగ తులమెత్తు తామ్రంబు మూసఁ జేసి
యొక్క తులమెత్తు దరదంబు నునిచి కిరస
నూనెఁ బోయుచు వేర్వేర నూరు మార్లు
కాల్చి తీసిన దరదంబుఁ గట్టియుండు

కం॥ ఈ కట్టు హింగుళంబును
శ్రీకరమగు వెండి కరిగి చేర్చిన తోడన్
తూకం బెక్కుచు రజితము
ప్రాకటముగ నురువు తగ్గి రంజిలుచుండున్

కం॥ ఈ వెండిని గఱగించుచు
కోవిదులారస కళంక కూటంబిడినన్
చేవగల పైడియగు రా
జీవాక్ష! వాదకులకు జీవన మిదియే

తే॥ అగ్నిబద్ధ మహారస మన్నిచోట్ల
నెందరో చెప్పియున్నను నిండుగాను
చేయలేరైరి మొదలంటఁ జెడిరి గాదె
మూఢమతులైన కుజనులు పుడమిలోన

తే॥ అంజనంబును వాదజయమ్ము స్పర్శ
వేధి ధరన సాధ్యంబగు విజ్ఞులైన
వారలకది భైరవుని కృపారసంబు
వరము గలిగిన సాధింపవచ్చు నభవ

కం॥ రస మొక లోహంబుగ ధర
పొసగంగా మారునట్టి పూర్ణద్రవమై
పసలెగ జిమ్మెడి ద్రవ్యము
బిసరుహ సంభవుని బోలి వెలయున్ ధరిత్రిన్॥

కం॥ ఏ మూలిక దివ్యంబై
సామూహక వస్తుకోటి సంపదలోనన్
శ్రీముఖమై వెల్గెడి దే
దో, మునుగనుఁ గొన్ని గొప్ప యోషధివలనన్

కం॥ పారదము వహ్ని జయమై
ధారుణి సంపూర్ణ బద్ధతత్త్వంబగు నం
చాఋషిపుంగవు లందురు
నేరరు మతియొక్కడైన నిజమున్ దెలియన్

కం॥ నానావిధ యోగంబులు
నానావిధ మార్గములును నవ్యర్షులు భి
న్నా నూనతఁ బలికిరి గా
నీ నిజము పరీక్షఁ జేసి యెరుగరు బుద్ధిన్

వ॥ వెండియు

-: అనుభవ రసగిన్నె యోగము :-

సీ॥ ఉల్లిపాషాణంబు తెల్లటి సూతంబు
సబ్బు నీ మూడును సమము నూరి
తామ్ర సంపుటిలోనఁ దగ పాతికెత్తు నీ
మందు వైచుచు నియమముగ దాని
కుక్క తంతె బిగించి చక్కగా చీలిచ్చి
నాల్గైదు పిడకల నయముగాను
పుటమిడి పిదప సంపుటిలోన నంటిన
మందును గైకొని మఱల మఱల

తే॥ ఆ కళంకము నొక్క శేరగు వరకును
వండి సమకూర్చి యదియెల్ల భద్రమూసఁ
జేర్చి కరిగిన ఘుటికగు సిద్ధముగను
వాసుదేవ! జగన్నాథ! పరమ పురుష!

తే॥ అడ్డసరము రామ ములక అసిత కనక
పత్ర రసముల వేర్వేర పాదరసపు
గుళిగ కరిగేడు మారులు తెలివితోడ
బోసిరేనియు యది వన్నె పొలుపుగాంచు

సీ॥ మైన మొక్క తులంబు వైనంబుగా గిన్నె
గట్టుచు తర్వాత గట్టి యిసుక
పొరమన్ను మర్ధించి మూసగట్టుచు నందు
చొక్కపు రసగుళ్లె చోద్యమలర
గరిగి పోతను బోసి సరసతో చల్లార్చి
గిన్నెను గైకొని వన్నె మీఱ
నొక్కొక్క పసురును యొక శేరు గావించి
యా గిన్నె నొక ఘామ నమలముగను
మూడు మూలికలందు ముమ్మారు నుడికించి
తీసిన రసగిన్నె దివ్య శక్తి

తే॥ గలిగి సూర్యోదయపు కాంతి వెలసియు చుండు
అమృతమైనట్టి యీ స్థాలి యందుఁ బాలు
మందులను పానమునఁ గొన్న మహిమ మీఱ
సకల రుజలను హతమార్చు సత్యమీశ

:- మఱియొక పద్ధతి రసగిన్నె విధానము -;

సీ॥ ఉల్లిపాషాణంబు తెల్లటి సూతమ్ము
సమపాళ్ల నీ రెంటి సరస నూరి
కోడిగ్రుడ్లంబిలి గూర్చుచు మర్ధించి
కొత్త ముంతకుఁ బెట్టి కుదురుగాను
ముంత మూతికి రాగి మూకుడు బోర్లించి
చీలమన్నతికించి చీలలిచ్చి
రెండు ఝాములు లెస్స వండిన నదియెల్ల
నా రాగి మూకుడు కంటియుండు
పలుకులన్నియు గీచి భద్ర మూసకు బోసి
కరిగిన ఘుటికగు కడకు దీసి
నల్లని యుమ్మెత్త తెల్లడ్డసరపాకు
రామములక పత్రిరసములందు
వేర్వేర నొక ఝాము విరివిగా వండి త
ద్రసమును మూస గఱగుచు పోత
గిన్నెను గైకొని వన్నెగ నమ్మూకుడు
యోషధీ రసముల నునిచి తాల్మి

తే॥ విడి విడిగ వండి రేనియు విమల మగుచు
బాల సూర్యోదయు లీలఁ బరగుచుండు
పాలు మందులు మహదను పానములును
పాదరస గిన్నె నిడి గ్రోల వ్యాధులడఁగు

-; ధాతువాద ప్రకరణము ;-

♦ నవలోహములు ♦

కం॥ పుత్తడి రజితము సీసము
నిత్తడి తామ్రమ్ము వంగ మిన్మును గంచున్
చిత్తము రంజిలు కాంతము
మొత్తం బివ్వి నవలోహములగు ముకుందా

- సప్త ధాతువులు -

ఆ॥ ఇత్తడిన్మురాగి పుత్తడి వెండి సీ
సతగరములు శాస్త్ర సమ్మతమిల
సప్తధాతువులుగఁ జాటిరి వైద్యులు
సజ్జన నుత పాత్ర చన్నరాయ

-; సప్తోపధాతువులు ;-

వ॥ మరియును స్వర్ణంబు నుండి స్వర్ణమాక్షికంబును, వెండి నుండి తారమాక్షికంబును తామ్రంబు నుండి తుత్థంబును, వంగము నుండి కంకుష్టంబును, ఇత్తడి [తుత్తినాగము]నుండి కఫరియు నాగంబు నుండి సింధూరంబును, లోహంబు నుండి లోహ కిట్టంబును క్రమంబున నొదవె. ఇవి సప్తోప ధాతువులనం బ్రసిద్ధంబులై యుండు. ప్రాచీన మహర్షులచే నుడువంబడిన రసవాద శైవాగమ, మంథాన భైరవ, రసరత్న సముచ్ఛయ, రసహృదయ,రసప్రదీపిక, రసేంద్రచింతామణి, సిద్దనాగార్జునీయ రసగంగాధర రసార్ణవ రసరత్నాకర, రసనిఘంటు, సోమనా థీయ, భావప్రకాశిక, రాజ నిఘంటువులు, మొదలుగా గలిగిన గ్రంథంబులందు నీ లోహంబు లనేక విధంబులుగ వివరింపం బడియె. మనప్రాచీనులు నల్బదియైదు రకముల లోహంబులను

గనుంగొనిరి. కొందరాధునిక రసాయన విజ్ఞానులు 'ప్లాటినం' బనంబడు మహాధాతువును 'టంగ్‌స్టనం' బడు బరువుగలిగిన ధాతువును ఉష్ణోపకాంతి రూపాత్మ్యకం బైన 'రేడియమును' నికెలనంబడు ధాతువును పరిశోధించి గనుంగొనిరి, కృత్రిమ లోహ విధానంబెట్లనిన:

ఆ॥ మూడుపాళ్లు రాగి మురువైన యశదము
రెండుపాళ్లఁ గూర్చి ఖండితముగ
గఱఁగ నిత్తడియగు మెఱుగెక్కి యష్టాంశ
జలము కంటె బరువు గలిగి యుండు

ఆ॥ రెండు పాళ్లఁ సత్తు రెండు పాళ్లను రాగి
నెత్తి గఱఁగ పసిఁడి యిత్తడి యగు
పుత్తడివలె నుండు పూర్వము మనవారు
నగలుచేసి యమ్మినారు వసుధ

తే॥ ఇత్తడికిని మూడవ వంతు సత్తుఁజేర్చి
కఱగ పిత్తళియగు వెండి కాంతు లెగయ
తామ్ర మెన్మిది పాళ్ళను తగర మొండు
పాలు యశదము పాలు బొంటాయి మూస
జేర్చి కరిగిన కంచగు శ్రీనివాస

తే॥ తామ్రమున కెన్మిదవ వంతు తగర మెలిమి
తగరమునకు సమాంశ మిత్తడిని గలిపి
కరిగిరేనియు యంత్రము మరఫిరంగి
భాగములలోని లోహంబు పరిఢవిల్లు

-: ఆధునిక మిశ్రమ లోహ విధానము :-

వ॥ రాగి, అల్యూమినియము గలిపి కఱగినచో బంగారవన్నె

యేర్పడును. మఱియు రాగి, ప్లాటినము టంగస్టిక్ ఆసిడ్డు మూత వేసిన మూతలో గలిపి కఱగిన పిమ్మట నిజమైన బంగారమును సరిపడునట్లు గలిపినచో బంగారుకు సరియైన వన్నె లోహ మేర్పడును. తర్వాత వెండి, ప్లాటినము, రాగి వాటి వాటికి చెప్పబడిన ప్రమాణములు ప్రకారములు నెత్తింగి కల్పి గఱగినచో చక్కని వన్నెగల బంగార మేర్పడును. రాగి జింకు, నికెలు, తగరము, అల్యూమినియము బిస్మత్తు క్రమ రీతిని గలిపి కఱగిన కృత్రిమ వెండియగును. రాగి తుత్తి నాగము, నికెలు పరిమిత ప్రకారము గలిపి గఱగినచో జర్మనీ వెండి యగును. చైనా దేశమువారి వెండి నిర్మించుటకు ఈ క్రింద నుదహరించిన ధాతువులు భాగము తెరిగి క్రమ రీతిని గరగవలయును. ఎట్లంటేని: రాగి 65·1/5 పాళ్ళు జింకు, 19½ నికెలు 13 పాళ్ళు చాదీ వెండి 2½ కోబల్ టాప్ ఆయిరన్ 12 పాళ్ళు కలిపి క్రమరీతిని గఱగిన చైనీస్ సిల్వ రగును.

తే॥ తార యెనిమిది భాగాలు తామ్ర మదియు
నాల్గు భాగాలు ద్వివిదాంశ నాగనుమల
స్వర్ణ మొక భాగ మవియన్ని బాగ గఱఁగి
రక్తచిత్రము రసమును యుక్తి వైవ
తార యదియెల్ల కనకమై ధరణి నెగడు

-: ఒక్క వీశె తగరమును వెండిగా మార్చు విధానము :-

కం॥ ఉప్పుడు బియ్యపు తవుడును
నిప్పులపైఁ జల్లి పొగను నిర్మించుచు నే
ర్పొప్పగ తొమ్మిది యుప్పుల
కుప్పకు లెస్సంగ నంటుకొనగాచి మరిన్

సీ॥ కప్ప చిప్పలు దెచ్చి కడుతెల్లగా దోమి
నిమ్మపుల్సును తాళకమ్ము నూరి
చిప్పలఁ బట్టించి గొప్పగా పుటమిడి
భస్మంబు గావించి భస్మమునకు
సమమొప్ప నా నవాక్షారంబు గలగల్పి
పొసగించి మర్దించి ముద్దచేసి
ఘనమైన గాజు పింగాణి చట్టిన బెట్టి
జంగమ తైలంబు సరస దీసి
తత్తైలమున నుమ్మెతాకు పసగుగల్పి
యొక బానలో తగ్గ మొక్క వీసె
రేకులుగా గొట్టి రేకులన్నియు బెట్టి
ఉల్లిపాషాణంబు నొక్క ఫలము
కల్లుప్పు నొక శేరు కల్పి నున్నగ నూరి
పొడిచేసి రేకులఁ బొరల చల్లి
తల నా జంగమ తైలంబు ననుభవం
బుగ బోసి పొయ్యిపై ముద్దినములు

తే॥ గాఢ వహ్నుల వండిన ఘటములోన
మహిమ మీర రసాయన మార్పు బొంది
తగరలోహంబుఁ గరగి చోద్యంబుగాను
రజితమై చొక్కమై యలరారు దేవ

:- రజిత యోగము :-

సీ॥ రెండుపాళ్ళ రసంబు రెండుపాళ్ళుల్లియు
కోడిగుడ్డు రసానఁ గూర్చి నూరి
యండంబు డొల్లలో నదియెల్ల నిడిమూసి
చీలిచ్చి పుటమిడి మేలిమియగు
ఆకళంకము పాలు నైదు పాళ్ళను రాగి
గఱగిన వెండియూ కడకు దీసి
ఇందులో నొకపాలు నింపైన రజితము
గలగల్పి కఱగియు కడకు బెట్టి

యితే॥ట్టి వెండిని పులుసులో నేడుమార్లు
కాచియద్దిన మేల్మిచిత్కాశల వెలుగు
కట్టు కట్టిన ఉల్లియు గలిగియున్న
బీజమెందుకు? వలదయ్య! విశ్వరూప!

- సువర్ణ యోగము -

తే॥ ధరణి అభ్రక సత్వము వరహ యెత్తు
బద్దరసమొక తులమెత్తు పసిండి వరహ
కూర్చి యీ మూడు కఱగియు ఘుటికగట్టి
గంధకంబును మణిశిల గలిపి పిదప

తే॥ చిత్కాశంక భస్మాదులు సిందురములు
గాగఁ దీర్చి రజితమును గఱగి పైవ
పసిండియగు నీ సువర్ణంబు పరుస వేధి
మూడు భావము లిందుండు పూర్ణముగను

కం॥ ఈ రస సువర్ణ లోహము
ధారణ భక్షణము వలన ధర్మజ్ఞులకున్
శ్రీరంజిల సిద్ధుల నిడు
ఘోర వ్యాధులను బాపి కూర్చును శుభమున్

♦కడవకొలను గ్రామం మా తండ్రి శీనయ్యగారి యనుభవ యోగములు♦

-: ఉల్లిపాషాణ కట్టు క్రమము :-

ఆ॥ ఊర జముడు పాల నుల్లి పాషాణంబు
మీర దశ దినములు నూరబెట్టి
మెదిచిరేని కట్టి మెరయుచుండును యోగ
ములనుఁ జేర్చిరేని ఫలము గలదు

-: ఉల్లి మ్మ్రియు తాళకము కట్టు విధానము :-

సీ॥ అలసంద జొన్న గింజల పిండి జిల్లేడు
పాలతో గలుపుచు వైనముగను
మైనంబు గావించి మంచి యుల్లిని మాటి
మేలైన యేరండ తైలమునను
నూటయిర్వదియైదు మేటి యావర్తులు
వంకిన గట్టును పద్మనాభ
కలుబొందలో తాళకము రెండు ఝాములు
తెల్ల గంజరు వేళ్ళ తీర్థమునను
పదిరెండు ఝాములు బాగుగా మర్దించి
బిళ్ళ చేసియు నారబెట్టి మఱియు
గట్టికుండకు తెల్ల గలిజేరు బూడిద
నర్ధ భాగము కూరి యందు పైన
నా బిల్ల నిడి బూది యంతయుఁ బడ్బోసి
మూతికి మూకుడు మూసి పిదప

తే॥ మూడు ఝాములు వండిన ముచ్చటగను
తాళకముఁ గట్టి పొగకట్టి ధరణి వెలయు
వైద్య వాదములందిది ప్రథమ పాత్ర
నాడుచున్నది గురుతుల్యుఁ డగుచు నభవ

:- వంగ రజిత యోగము -:

సీ॥ పావు శేరును శుద్ధ వంగంపు రేకులు
తెల్ల చెఱుకు ద్రాక్ష తెచ్చి మాటి
కుక్కుట పుటమిడి గుర్తించి దానిని
పలుచగ దట్టుచు తెలిక పిండి
మధ్యంబు నందుంచి మాటి యేనుఁగు పుట
మిడిరేని భస్మమై యేపు మీరు

నీ భస్మ మొకపావు హితవుగ గట్టిన
ఉల్లిపాషాణంబ దెల్ల రెండు
తులములు కట్టి రాజిలునట్టి తాళంబు
తులమెత్తు సూతంబు దుగ తులములు
అభ్రక నవనీత మదియొక్క తులమును
వెలిగార మదియొక్క తులముఁ జేర్చి
బ్రహ్మ జముడు పాల రాజన జిల్లేడు
పాల నీ యన్నింటి వస్తువులును
నాలుగు ఝాములు మేలుగా మర్ధించి
తగర రేకులఁ బూసి తక్షణమున

తే॥ మూసలోఁ జేర్చి కఱగిన వాసి మీఱ
వర రజితమగు డాకలిపైనఁ బెట్టి
మోదినఁ బగులు సీసంబుఁబొత్తు చేర్చి
యూదినను దివ్య రజితంబు నుద్భవిల్లు

:- బద్ద పారద రజిత యోగము :-

సీ॥ శేరు పాదరసంబు శేరు కల్లుప్పున్ను
జొన్నకలిని నూరి చెన్ను మీఱ
కలి కుండలోఁబోసి నలుజాలు క్రమముగ
వండుచు మరునాడు కుండ దించి
నీళ్ళచేఁ గడుగుచు నీరీతి పండ్రెండు
దినములు వండియు తీసి రసము
విరివిగా నూరిన వేపాకు ముద్దను
గురిగ నొనర్చుచు గురిగెలోనఁ
బోసి ముద్దను జేసి మూకుడులో నుంచి
వేగ నూరిన చిన్న విరికి యాకు

తే॥ దానిపైనను యతికించి వైనముగను
పైన నొక క్రొత్త మూకుదు బాగమూసి
చీలలలరించి యేసుఁగు మేలి పుటము
బెట్టిరేనియది కఱంగి బిళ్ళయగును

కం॥ ఆ రస బిళ్ళను తామ్రము
నీ రెంటిని కఱగిరేని యేర్పడు రజితం
బారయ దానికి సీసము
జేరిచి యూదించిరేని శ్రీరజితమగున్

*- అభ్రక సత్త్వము దీయు క్రమము -*

సీ॥ ధాన్యాభ్రకంబును దానిలో సగబాలు
పసపు పొడి రసాన బాగ నూరి
బిళ్ళ చేసియు నారబెట్టుచు నెండించి
యది వజ్రమూస నింపారఁ గూర్చి
విరివి గాఢాగ్నిచే విశ్వకర్మ పుటాన
నూదిన పూజలింపొదవ నొదవు
వీని నన్నిట గూర్చి వెలిగారమున గల్పి
మూసఁ గరగిన నిశ్శేషముగను

తే॥ దివ్య సత్త్వము వెలువడు విశ్వరూప!
ఇటుల నున్నట్టి యోగంబులెల్ల గనుచు
అనుభవ గ్రంధ యోగమ్ము నభ్రకమున
సత్త్వమును దీసి సాఫల్య జయము గొనుడు

• ఫల శృతి •

తే॥ సూతవేధ సువర్ణంబు శోభితముగ
మేన నిత్యంబుఁ దాల్చిన మానవులకు
వసుధ దీర్ఘాయు రారోగ్య వైభవములు
బ్రహ్మ వర్చస్సు సద్గతి ప్రాప్తిఁ గలుగు

ఉ॥ ఏది ప్రయోగ మెచ్చటది యే విధమైన సమష్టి జాతి యే
దేది సమిశ్రమం బచట నేర్పడు శక్తికి మూలమేది యం
దేది విమర్శనా ఫలిత మెయ్యది యంచు దలంచినప్పుడే
సాధన సేసి నప్పుడె కుశాగ్ర మనీషి జయంబుఁ బొందెడున్

సీ॥ వస్తువాదము వాద వైద్య మెరుంగని
వైద్యుని ధీశక్తి పటిమ యేల ?
పాషాణ జాతి సంభవ మొకిం తెఱుగని
వాద విజ్ఞాని తత్త్వఁబదేల?
మూలికా తత్త్వార్థ మూలమెరుంగని
బైరాగి యనుభవ భక్తి యేల ?
అజరామరత్వ మర్యాద లెరుంగని
సిద్ధుని తత్త్వైక్య సిద్ధి యేల?

తే॥ నిరుపయోగంబులై చెడు ధరణిలోన
వెలుగు చిల్కనిదే వెన్న దొరుకునయ్య !
బుద్ధి కుశలత లేనట్టి మొరటు కకట!
పాటువడినను శ్రమదప్ప ఫలము గలదె

కం॥ ఈ కృతి వ్రాసిన చదివినఁ
దేకువ వినిపించినట్టి ధీరాత్ములకున్
శ్రీకైవల్యము విభవము
శ్రీకాంతుఁ డొసంగి శుభముఁ జేకూర్చు ధరన్

కం॥ శ్రీ కడవకొలని పుర ల
క్ష్మీకాంతా! సుజనకోటి సేవిత పాదా!
సాకార చన్న కేశవ!
లోకావన! నిర్మలాత్మ! లోకస్తుత్యా

కం॥ పంథొమ్మిది వందలు ర
కి్త్రంధగ నెనుబదియు మూడు క్రీస్తుశకమునన్
గ్రంధంబుఁగూర్చి తత్కృతి
అందంబుగ హరికి నర్పణంబుగ నిడెదన్

-: గద్యము :-

ఇతి శ్రీమన్నారాయణ చరణారవింద నిష్యంద మరందపాన తుందిలాయ మానేందిందిర సదృశమానసాంధ్ర వైష్ణవాత్రేయ సగోత్రా పస్థంభ సూత్రాన్నదాన - వేంకట నరసయాచార్య పౌత్ర, తిమ్మాంబ శీనయాచార్యపుత్ర కడవకొలని పురభిషగ్రిత్న, నృసింహాచార్య విరచితంబైన శ్రీ యగస్త్య రసాయనిక తంత్రంబేకాశ్వాస ము సంపూర్ణము

శ్రీ కృష్ణార్పణమస్తు.

ఓం తత్స.

